శ్రీమతే రామానుజాయ నమః

# పాశురప్పడి రామాయణమ్

(ఆంధ్ర వివరణంతో)

పరమ కారుణికులు, వ్యాఖ్యాన చక్రవర్తి, శ్రీకృష్ణ సూరి నామధేయులు అయిన పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన పలు గ్రంథాలలో ఈ "పాశురప్పడి రామాయణమ్" అనే గ్రంథం ఒకటి. ఇది స్వతంత్ర గ్రంథం కాదు. ఆళ్వారుల దివ్య ప్రబంధాలలో రామాయణ గాధకు సంబంధించిన ప్రయోగాలను కథాక్రమంలో గూర్చి సంకలనం చేసి, ఒక అద్భుతమైన ప్రక్రియలో కూర్చిన గ్రంథం. ఈ రకమైన ప్రక్రియను ఇంతకు ముందు ఎవ్వరూ ప్రయత్నించినట్లు తోచదు. అందువల్ల ఇది అపూర్వమైనది. ఈ ప్రక్రియను అనుసరించి, తరువాత అళగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనే ఆచార్యులు ఆచార్య హృదయం, అరుళి చ్చెయల్ రహస్యమ్ అనే గ్రంథాలను కూర్చారు.

పెరియవాచ్చాన్ పిళ్లై తంజావూరు జిల్లాలోని తిరువెళ్లియం గుడి సమీపంలో ఉండే శంగనల్లూర్ గ్రామంలో క్రీస్తు శకం 1227 వ సంవత్సరం సర్వజిత్ నామ సంవత్సరంలో శ్రావణమాసం కృష్ణపక్షం అష్టమి తిథితో కూడుకొని ఉండే రోహిణి నక్షత్రంలో అవతరించారు. వీరి తల్లిదండ్రులు శ్రీమతి నాచ్చియారమ్మాళ్, శ్రీ యామునాచార్యులు దంపతులు. శ్రీజయంతి నాడు, అంటే, శ్రీ కృష్ణాష్టమి పండుగనాడు వీరు అవతరించడం వల్ల,వీరికి కృష్ణన్ అనే నామాన్ని పెట్టారు, వీరి తల్లిదండ్రులు.

వీరి అవతారానికి సంబంధించిన సాంప్రదాయకమైన ఒక వృత్తాంతం ప్రసిద్ధమైనది. తిరుమంగై ఆళ్వారులు పెరియ తిరుమొళి ప్రబంధంలో తిరువెళ్ళి యంగుడిలో దశకం చివరిలో "మెయ్ మ్మై శొల్లిల్ వెణ్ శంగ మొన్డేందియ కణ్ణా! నిన్ తనక్కు కుటిప్పాగిల్ కట్కలామ్ కవియిన్ పొరుళ్ తానే" (తెల్లని పాంచజన్యశంఖాన్ని చేతిలో ధరించిన శ్రీకృష్ణా! నిజం చెప్పాలంటే, నా కవిత్వంలోని అర్థాలను నీవు తెలుసుకోవాలని

అనుకున్నట్లయితే, నీవు నా దగ్గర విని తెలుసుకోవచ్చు) అని అన్నారు. ఆ విధంగా తిరుమంగై ఆళ్వారులచేత నియమింపబడిన శ్రీకృష్ణుడే ఈ పెరియ వాచ్చాన్ పిళ్ళైగా ఈ లోకంలో, శ్రీకృష్ణ జయంతి నాడు, రోహిణీ నక్షత్రంలో అవతరించాడని, ఆ స్వామి సంకల్పాన్ని అనుసరించి, తిరుమంగై ఆళ్వారులు, అంతకు ముందుగా, ఆ ఆళ్వారుల జన్మ నక్షత్రం అయిన కార్తీక మాసం కృత్తిక నక్షత్రంలో నంబిళ్ళై అనే ఆచార్యుల రూపంలో అవతరించారని, తిరుమంగై ఆళ్వారుల అవతార విశేషం అయిన నంబిళ్ళై సన్నిధిలో శ్రీ కృష్ణస్వరూపులైన పెరియవాచ్చాన్ పిళ్లై నాలాయిర దివ్యప్రబంధాల రస్య రహస్యార్థాలను శ్రవణం చేసి, వాటిని తమ వ్యాఖ్యానాల రూపంలో లోకానికి అనుగ్రహించి, వ్యాఖ్యాన చక్రవర్తి అనే అన్వర్థమైన బిరుదాన్ని పొందారని విశ్వసింపబడుతున్నది. వీరు, రామాయణ భారతాది గ్రంథలలోని అభయ ప్రదాన శ్లోకాలకు అన్నింటికీ విశదమైన వ్యాఖ్యానాలను అపూర్వంగా అనుగ్రహించి, అభయ ప్రదులని, అభయప్రద రాజులని కూడా తమ కాలంలో ప్రసిద్ధిని పొందారు.

పరత్వాది పంచకం శ్రీ రంగనాథుని విషయంలోనిదే – అని మన పూర్వాచార్యుల నిర్వాహం. ఈ విషయాన్ని, ఉ. వే. శ్రీమాన్ వేలుక్కుడి వరదాచార్య స్వామివారు తమ “అరుళిచ్చెయల్ అనుభవమ్” అనే గ్రంథంలో స్పష్టం చేశారు. ఈ దివ్య ప్రబంధ పాశురప్పడి రామాయణమ్ ఆరంభంలోని మొదటి సూక్తులు ఈ అర్థ సమన్వయాన్ని బలపరుస్తున్నవి.

ఈ గ్రంథంలో కూర్చబడిన ప్రయోగాలు అన్నీ ఆళ్వారుల దివ్యప్రబంధాలలో గోచరిస్తున్నప్పటికీ, ఒకటి రెండు ప్రయోగాలు మాత్రం గోచరించడం లేదు. శబ్దతః అనుసంధించినట్లు కనబడడం లేదు. ఉదాహరణకు, “శవరి తంద కని ఉవందు” “కల్లై పెణ్ణాక్కి” అనే ప్రయోగాలకు దివ్య ప్రబంధాలలో ఆకరం కనిపించలేదు.

## పాశురప్పడి రామాయణమ్

ఈ పాశురప్పడి రామాయణాన్ని అనుసంధానం చేసినందువల్ల చాలా గొప్ప ప్రయోజనం లభిస్తుంది. సామాన్యంగా భారతీయులలో, చాలా మంది ప్రతిదినం శ్రీరామాయణంలోని సంక్షేప రామాయణ సర్గను, అంటే, శ్రీరామాయణంలోని మొట్టమొదటి సర్గను పారాయణ చేసుకోవడం అలవాటు. ఆ సర్గలో రామగాథను సంగ్రహంగా నారదుడు వాల్మీకి మహర్షికి ఉపదేశించాడు. ఈ సర్గను పారాయణ చేసినందు వల్ల శ్రీరామాయణంలోని 24 వేల శ్లోకాలను పారాయణ చేసిన ఫలం దక్కుతుందని పెద్దల అభిప్రాయం. ఈ దివ్య ప్రబంధ పాశురప్పడి రామాయణంలో ఆళ్వారుల దివ్య ప్రబంధాలలో ఆళ్వారులు అనుసంధించిన రామ చరిత్రకు సంబంధించిన ప్రయోగాలను కూర్చి సంకలనం చేయడం వల్ల, ఈ గ్రంథాన్ని అనుసంధానం చేస్తే,అటు శ్రీరామాయణంలోని 24 వేల శ్లోకాలను, ఇటు ఆళ్వారుల దివ్య ప్రబంధాలను అన్నిటినీ అనుసంధానం చేసినంత ఫలం దక్కుతుంది అని మన పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ విధంగా ఈ ప్రబంధాన్ని అనుసంధిస్తే, సంస్కృత వేదానికి ప్రతిరూపం అయిన శ్రీరామాయణంలోని 24 వేల శ్లోకాలను, ద్రావిడ వేదంగా ప్రసిద్ధి చెందిన ఆళ్వారుల దివ్య ప్రబంధాలను అనుసంధించిన అనుభూతి, ఫలం దక్కుతుంది. ఇందువల్ల ఈ లఘు ప్రబంధం ప్రపన్నులకు అందరికీ నిత్యం అనుసంధించదగిన సుకృతి.

దివ్యసూరుల ప్రబంధాలలోని పాశురాల రూపంలో సంకలనం చేసిన కృతి కనుక, దీనికి దివ్యప్రబంధ పాశురప్పడి రామాయణం అనే పేరు ఏర్పడింది.

ఈ గ్రంథానికి ఇంకొక విధమైన గొప్పతనం కూడా ఉన్నది. ఈ గ్రంథంలో సంకలనం చేయబడిన సూక్తులు అన్నీ ఆళ్వారుల దివ్య ప్రబంధాలలోనివి అని ఇంతకు ముందే తెలుపబడింది. అల్వారుల దివ్య ప్రబంధాలకు అన్నింటికీ వ్యాఖ్యానం చేసినవారు పెరియ వాచ్చాన్ పిళ్ళై.

అందువల్ల ఈ గ్రంథంలో సంకలనం చేయబడిన సూక్తులకు అన్నిటికీ కూడా వారే వ్యాఖ్యానం చేసినట్లు అయినది. తాను సంకలనం చేసిన గ్రంథానికి తానే వ్యాఖ్యానం చేసిన విలక్షణత ఈ గ్రంథానికి, ఇందువల్ల, ఏర్పడింది.

ఈ కృతికి, ఇంతకు ముందే, అంటే, 1989వ సంవత్సరంలో, చాలా సంగ్రహంగా దాసుడు అనువాదాన్ని చేయడం జరిగింది. ఇప్పుడు, మరికొంత వివరణతో అనువదింపబడుతున్నది. ఈ గ్రంథాన్ని ముద్రించడానికి ముందుకు వచ్చిన శ్రీరామానుజ సిద్ధాంతసభకు, (సికింద్రాబాద్), నన్ను ఈ కార్యంలో ప్రోత్సహించిన శ్రీరామానుజ సిద్ధాంతసభ అధ్యక్షులు ఉ. వే. శ్రీమాన్ కె. కె. పరకాలన్ స్వామివారికి, కార్యదర్శి శ్రీమాన్ శశిధర్ గారికి అనేక కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. ఈ పాశురప్పడి రామాయణగ్రంథ ముద్రణకైంకర్యం శ్రీ శ్రీ శ్రీ పరమహంసపరివ్రాజకాచార్య త్రిదండి శ్రీమన్నారాయణ చిన్నజీయర్ స్వామివారి శిష్యులు, పరమపదవాసులు శ్రీ శిరివూరి రామచంద్రన్ రాజుగారి జ్ఞాపకార్థం, వారి కుమారులు శిరివూరి శ్రీవెంకటనారాయణ రాజు, కోడలు శ్రీమతి శిరిమూరి అనురాధ దంపతులు (విజయనగరం) సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో చేయబడడం చాలా ఆనందదాయకం. వీరికి అనేక మంగళాశాసనాలను అందిస్తున్నాను. ఈ గ్రంథాన్ని ముద్రణకు అనుకూలంగా సిద్ధం చేసిన సహృదయులు శ్రీమాన్ వంగల కేశవ అయ్యంగార్ స్వామివారికి అనేక మంగళాశాసనాలు. స్వస్తి.

భాగవతదాసుడు,

ఈ.ఏ. శింగరాచార్యులు.



**శ్రీమత్కృష్ణసమాహ్వాయ నమో యామునసూనవే |**
**యత్కటాక్షైకలక్ష్యాణాం సులభః శ్రీధర స్సదా ||**

ఎవరి కటాక్షాలకు అద్వితీయమైన లక్ష్యం అయినవారికి భగవానుడు సదా సులభుడు అవుతున్నాడో, అటువంటివారు, శ్రీయామునాచార్యులవారి కుమారులు, శ్రీకృష్ణ సూరి అనే పేరును కలవారు అయిన పెరియ వాచ్చాన్ పిళ్ళైకు నమస్కారం.

# బాలకాండమ్

బాలకాండ కథాభాగంలో సంకలనం చేయబడిన సూక్తులను ఆరు విభాగాలుగా విభజించవచ్చు. మొదటి భాగంలో, శ్రీరామునిగా అవతారం స్వీకరించినవాడు పరమపదనాథుడే అనే విషయాన్ని పెరియ వాచ్చాన్ పిళ్ళై ప్రస్తావిస్తున్నారు. అందువల్ల, మొదటి ఆరు వాక్యాలతో కూడుకున్న మొదటి భాగంలో శ్రీరాముని పరమపదనాథునిగా భావించడం జరుగుతున్నది.

**“తిరుమడందై మణ్మడందై ఇరు పాలుమ్ తిగழ”**

(పెరియ తిరుమొழి–3 –10–1)

ఆశ్రితుల దోషాలను భగవానుడు క్షమించేటట్టు చేసే కరుణాస్వరూపిణి అయిన మహాలక్ష్మి.

ఆశ్రితుల దోషాలను గమనించి చూడడం కూడా సహించలేని క్షమా స్వరూపిణి అయిన భూదేవి అనే ఈ ఇద్దరు తనకు రెండు వైపులా ప్రకాశిస్తూ ఉండగా, ఇందువల్ల, ఇక్కడ దివ్యదంపతీసమేతుడై ఉన్నందువల్లనే భగవానునకు ఆశ్రిత సంరక్షణలో కోసం అవతారాన్ని స్వీకరించాలనే సంకల్పం ఏర్పడినదని సూచింపబడింది. కావ్యాన్ని ఆరంభం చేసేటప్పుడు శ్రీ

శబ్దప్రయోగంతో ఆరంభం చేయడం అనేది ఒక కావ్య పరిపాటి. ఆ క్రమంలో ఇక్కడ శ్రీకృష్ణసూరి తిరు అనే శబ్దంతో ఈ గ్రంథాన్ని ఆరంభించారు.

**"నలమ్ అంత మిల్లదోర్ నాట్టిల్"**(తిరువాయ్ మొ**ఴి**– 2–8–4)

అంతులేని ఆనందాన్ని కలుగజేసే అద్వితీయమైన నిత్యవిభూతిలో.

ఈ విధంగా సంకల్పం చేసిన భగవానుడు ఎక్కడ ఉన్నాడో, అటువంటి, నిత్యవిభూతి అనబడే దివ్యదేశ వైభవాన్ని ఈ ప్రయోగం తెలుపుతున్నది. ఈ పరమపదం అనేది అంతు లేని ఆనందాన్ని కలిగించే దివ్యదేశంగా శాస్త్రాలలో చెప్పబడుతున్నది. ఈడు వ్యాఖ్యానంలో కూడా నంబిళ్ళై ఈ పరమపదం నిరతిశయ భోగ్యమై ఉంటుందని అన్నారు కదా. లోకంలో స్వర్గం అనేది సుఖమయమై ఉంటుందని చెప్పబడినప్పటికీ, అది దుఃఖంతో కూడినదై ఉంటుంది తప్ప, సంపూర్ణమైన సుఖాన్ని ఇవ్వలేదు. కానీ, పరమపదం ఆ విధంగా కాకుండా, దుఃఖలేశం కూడా ఏ మాత్రం లేని పరమానందాన్ని ఇవ్వగలదు.

**"అందమిల్ పేరిన్బత్తు అడియరోడు"**

(తిరువాయ్ మొ**ఴి**–10–9–11)

**నిరవధికమైన మహానందాన్ని అనుభవించే నిత్యముక్తులతో పాటు,**

పరమపదంలో కలిగే ఆనందం అంతు లేనిదై, యావదాత్మ భావిగా ఉంటుంది, అంటే నిత్యంగా ఉంటుంది. కానీ, ఇతర లోకాలలో కలిగే ఆనందం ఆ విధంగా నిత్యంగా, నిరతిశయంగా ఉండదు.

**"ఏ*ఴు*లగమ్ తనిక్కోల్ శెల్ల వీ*ఱ్ఱి*రుక్కుమ్"**

(తిరువాయ్ మొ**ఴి**–4–5–1)

**ఏడేడు లోకాలలో తన అద్వితీయమైన శాసనం ప్రవర్తించేటట్లుగా వేంచేసి ఉండే,**

భగవానుని శాసనానుసారంగా సమస్త లోకాలు ప్రవర్తిస్తున్నాయి అనే విషయాన్ని బృహదారణ్యకోపనిషత్తు "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి!సూర్యా చంద్రమౌసౌ విధృతౌ తిష్ఠతః" (ఓ గార్గీ! అక్షర శబ్దంచేత చెప్పబడే ఈ పరమాత్మ ప్రశాసనంలోనే సూర్యచంద్రులు ఇద్దరు కూడా ప్రవర్తిస్తున్నారు) అనే వాక్యం తెలుపుతున్నది. ఇక్కడ చెప్పబడిన సూర్యచంద్రులు మిగిలిన అన్ని లోకాలకు, ఆ లోకాలలోని చేతనాచేతనాలకు ఉపలక్షణం. "శెల్ల" అనే ప్రయోగం విశిష్టమైనది. భగవానుడు తన శాసనం ప్రవర్తించడానికి ప్రత్యేకంగా ప్రయత్నం ఏమీ చేయనవసరం లేదు, శ్రమ పడనక్కరలేదు, ఆ భగవంతుని సంకల్పమే చాలు, జగత్తును నిర్వహించడానికి – అనే విషయాన్ని ఈ ప్రయోగం తెలుపుతున్నది.

వీற்றிరుక్కుమ్" (అధివసించి ఉండే) అనే ఈ ప్రయోగం పరమపదంలో భగవానుడు తన దివ్యసింహాసనంలో కూర్చుని ఉండే సన్నివేశాన్ని సూచిస్తుంది. అంతేకాదు, ఈ సన్నివేశం, తనకంటే వేరైనా సమస్త చేతన చేతనాలను తనకు శేషంగా కలిగి ఉన్నందువల్ల ఏర్పడిన అతిశయం తోచేటట్లుగా పరమాత్మ వేంచేసి ఉన్నాడు – అనే విషయాన్ని కూడా ఈ ప్రయోగం సూచిస్తుందని నంబిళ్ళై ఈడు వ్యాఖ్యానంలో వ్యాఖ్యానించారు. ఆ విధంగా వేంచేసి ఉండే స్వామి ఎవరు? అంటే,

## "అయర్ వఱుమ్ అమరర్ గళ్ అదిపతియాన"

(తిరువాయ్-మొழி-1-1-1)

**ఏ విధమైన అజ్ఞానం లేని నిత్యులకు అధిపతి అయినవాడు.**

ఆ నిత్య సూరులు ఎటువంటివారు? అని అంటే, ఇటువంటి జ్ఞానలోపం, శక్తి లోపం లేనటువంటివారు. స్వర్గాది పై లోకాలలో ఉండే దేవతలు అందరూ అమరులే అయినప్పటికీ, వారికి జ్ఞాన లోపం శక్తి లోపం ఉన్నది. ఎన్నో సందర్భాలలో వారు తమ పదవులను, అధికారాలను, సంపదలను పోగొట్టుకొని వాటిని తిరిగి ఏ విధంగా సంపాదించుకోవాలో తెలియక, భగవానుడైన శ్రీమన్నారాయణుని శరణు వేడిన సందర్భాలు మనకు వేదేతిహాస పురాణాదులలో అనేకంగా కనిపిస్తాయి. దేవతలందరిలో మొట్టమొదటివాడుగా, చాలా గొప్పవాడుగా చెప్పబడే బ్రహ్మకూడా తన అధికారాన్ని కోల్పోయి, తిరిగి ఆ అధికారాన్ని పొందడం కోసం "యుగకోటిసహస్రాణి విష్ణు మారాధ్య పద్మభూః, పునః త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవానితి శుశ్రుమ" (వేలాది కోట్ల సంవత్సరాలు యుగాలు బ్రహ్మ విష్ణువును ఆరాధించి, మళ్లీ తాను బ్రహ్మ పదవిని పొందాడని వింటున్నాము) అని చెప్పినట్లుగా చిరకాలం భగవానుని ఉద్దేశించి తపస్సు చేసి మళ్ళీ ఆ పదవిని పొందాడని చెప్పబడుతున్నది. కానీ, నిత్య సూరులు ఆ విధంగా కాకుండా, ఎల్లప్పుడూ భగవంతుని అనుభవాన్ని నిరంతరంగా "తద్విప్రాసః విపన్యవో జాగృవాంసః సమింధతే" అని చెప్పినట్లుగా పొందుతారు. అందువల్ల వారు "అయర్ వఱుమ్ అమరర్ గళ్" అని చెప్పబడుతున్నారు. అటువంటి నిత్యులకు అధిపతి భగవానుడు.

అమరులు అంటే మరణం లేనివారు అని అర్థం. ఇక్కడ, మరణం అంటే, భగవదనుభవానికి అంతరాయం కలగడమే. అదే వారికి

మరణంవంటిది. అటువంటి అంతరాయం లేనివారు కనుక, నిత్యులు అమరులు అని అనబడుతున్నారు. ఈ విషయాన్ని లక్ష్మణుడు "న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ!" (శ్రీరామా! నిన్ను విడచి సీతదేవి గాని, నేను గాని బ్రతికి ఉండలేము) అని అనడం ద్వారా తెలియజేశాడు కదా.

ఇంతటి జ్ఞానాన్ని శక్తిని కలిగిన నిత్యులు సైతం పరమాత్మను పరిపూర్ణంగా అనుభవించలేరు, వారికి కూడా పరమాత్మ అనుభవం పరిపూర్ణంగా అందదు. అంతటి, అంతు లేని నిరతిశయమైన, నిరవధికమైన వైభవాన్ని కలిగినవాడు, భగవానుడు అనే విషయాన్ని "అధిపతి" అనే పదప్రయోగం సూచిస్తున్నది. "ఆండూ*ழி* యూ*ழி*దొరుమ్ అప్పా*ழு*దైక్కు అప్పో*ழு*దు ఎన్నారావముదమే" (సంవత్సరాల పాటు,యుగాలపాటు నిరంతరంగా అనుభవించినప్పటికీ, ఎప్పటికప్పుడు పరమాత్మ అనుభవం తృప్తిని కలిగించని అమృతంవలె నిత్య నూతనంగా ఉంటుంది) అని ఈ విషయాన్ని ఆళ్వారులు కూడా అందంగా చెప్పారు.

**"అణియార్ పొ*ழி*ల్ శూ*ழ்* అరంగ నగరప్పన్"**

(పెరియ తిరుమొ*ழி*–11– 8–8)

**అందం నిండుగా కల తోటలను చుట్టూ కలిగిన శ్రీరంగంలో ఉండే, ప్రాణులందరికి తండ్రి అయిన శ్రీరంగనాథుడు.**

ఈ ప్రయోగం, వైకుంఠం వేరు, శ్రీరంగం వేరు కాదు, రెండు సమానమే– అనే సాంప్రదాయకమైన ప్రసిద్ధిని సూచిస్తుంది.

**"కావేరీ విరజా సేయం వైకుంఠం రంగ మందిరమ్,**
**స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్"**

(ఈ కావేరి నది పరమపదంలో ఉండే విరజానది. తీరంగంలోని రంగమందిరం సాక్షాత్తు వైకుంఠమే. శ్రీరంగనాథుడు పరమపదనాథుడే. పరమపదం ఈ విధంగా మన కంటికి సాక్షాత్కరిస్తున్నది.)

అనే పౌరాణిక సూక్తిని ఇక్కడ స్మరించాలి. చేతనులకు హితాన్ని కలుగజేయడంలో తండ్రివలె ఎల్లప్పుడూ ప్రవర్తించేవాడు, శ్రీ రంగనాథుడు– అనే విషయాన్ని ఇక్కడ "అప్పన్ "అనే పదం సూచిస్తుంది. లోకంలో కూడా తండ్రి హితప్రవర్తకుడు కదా. హితాన్ని కలుగజేసి రక్షించేవాడు కనుక, "పాతీతి పితా" అని తండ్రి "పితా" అని అనబడుతున్నాడు.

ఇకపై ఉండే రెండవ భాగంలో, ఇటువంటి ఆ పరమపదనాథుడు ఈ భూలోకంలో ఎందుకు శ్రీరాముడుగా అవతరించాడు? అనే విషయాన్ని ప్రస్తావిస్తున్నారు. ఈ విషయం ఏడు వాక్యాలు కలిగిన ఈ రెండవ భాగంలో ప్రస్తావింపబడింది.

**"అలైనీర్ క్కడలుళ్ అழுన్దుమ్ నావాయ్ పోల్"**

(తిరువాయ్ మొழி–5–1–9)

క్లేశాలు అనే కెరటాలను కలిగిన సంసారం అనే క్షుభితమైన సముద్రంలో మునిగే నావవలె ఉండే.

**"ఆవారార్ తుణై యెన్రు తుళంగుమ్"**

(తిరువాయ్ మొழி–5–1– 9)

మనకు రక్షకులు ఎవరు కాగలరు? అని తల్లడిల్లే,

రావణుడు పెట్టిన బాధల వల్ల దేవతలంతా చాలా క్లేశాలను పొందారు. క్షుభితమైన, కెరటాలతో నిండి ఉండే సముద్రం మధ్యలో ఉండే నావను తనను రక్షించేవాడు ఒడ్డుకు చేర్చే సమర్థుడు ఎవరు లేకుండా ఉన్నందువల్ల, చాలా భయాన్ని పొంది, తల్లడిల్లినట్లుగా, రావణాదుల వలన బాధలను పొందిన దేవతలంతా తమను రక్షించేవారు ఎవరు ఉన్నారు? అని తల్లడిల్లారు.

సముద్రం మధ్యలో ఒకడు చిక్కుకున్నట్లయితే, అతనిని వేరొకడు ఏదో ఒక విధంగా ప్రయత్నం చేసి రక్షించే అవకాశం ఉంటే ఉండవచ్చు. కానీ, ఆ విధంగా చిక్కుకున్నది ఒక నావ అయినట్లయితే, దానిని రక్షించడం ఏది భగవంతునకు తప్ప ఇంకొకరికి ఎవరికీ సాధ్యం కాని పని –అనే భావం ఇక్కడ నావను ఉదాహరణంగా చెప్పడం వల్ల తోస్తున్నది. ఇంద్రుడు మొదలైన దేవతలంతా రావణుడు పెట్టి బాధల నుండి తమను రక్షించేవాడు ఎవడు ఉన్నాడు అని తల్లడిల్లుతూ ఉండగా,

**“నల్ల అమరర్”** (తిరువాయ్ మొழி– 10 –1– 10)

**మంచి స్వభావాన్ని కలిగిన దేవతల**

**“తుయర్ తీర”** (పెరియ తిరుమొழி– 7– 8– 6)

**దుఃఖం తీరడంకోసం**

ఇక్కడ దేవతలను “నల్ల అమరర్” అని అనడం ఎందుకు? అంటే, వారు, తమకు కష్టం కలిగినప్పుడు, వేరొకరిని ఎవ్వరిని ప్రార్థించకుండా,తమ రక్షణ కోసం భగవానుడైన శ్రీమన్నారాయణునే వారు ప్రార్థిస్తారు, అందువల్ల

వారు మంచి స్వభావాన్ని కలిగిన దేవతలు అని అర్థం కోసం ఈ విధంగా ప్రయోగించబడింది అని నంబిళ్ళై వ్యాఖ్యానం. పరమ పురుషార్ధమైన మోక్షాన్ని వారు ప్రార్థించకపోయినప్పటికీ, కేవలం తమ ఐశ్వర్యాన్ని, ప్రాణాలను రక్షించమని మాత్రమే వారు భగవానుని ప్రార్థించినప్పటికీ, అందుకోసం ఇంకొకరిని ఎవరిని ఆశ్రయించకుండా, తమను తామే రక్షించుకోగలం అని అహంకరించకుండా, భగవంతుని ప్రార్థించారు కనుక వారు "నల్ల అమరర్" అయ్యారు. ఒకనికి కష్టం కలిగినప్పుడు, అతడు, తన కష్టాన్ని తీర్చి గట్టెక్కించమని అన్యులను ప్రార్థించకుండా, కన్న తండ్రిని ప్రార్థించడమే యుక్తం కదా. ఈ విషయాన్ని గీతాచార్యుడు భగవద్గీతలో "ఉదారా సర్వ ఏవైతే" అని అంటూ, తననుండి ఇహలోకపురుషార్థాన్ని ఆశించినవారుకూడా ఉదారులే అని అన్నాడు.

ఇంతవరకు "పరిత్రాణాయ సాధూనామ్" అనే ఒక అవతార ప్రయోజనం తెలుపబడింది. ఇకపై, " వినాశాయ చ దుష్కృతామ్" అనే వేరొక ప్రయోజనం తెలుపబడుతున్నది.

**"వల్లరక్కర్"** (తిరువాయ్ మొழி– 10–1–8),

**గొప్ప బలాన్ని కలిగిన రాక్షసులు నివసించే**,

రావణుడు, కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు మొదలైన, సాటి లేని బలాన్ని కలిగిన ఎందరో రాక్షసులు లంకలో ఉన్నారు. ఈ జగత్తుకు అనేక విధాలుగా ఉపకారం చేసి భగవానుడు పలు పేర్లను పొందినట్లుగానే, ఈ రాక్షసులు కూడా పలు దుష్కృత్యాలు చేసి గొప్ప పేరును సంపాదించారు. యాగాలను పాడుచేసి, సాధువులను హింసించి, మంచి పనులకు ఆటంకాలను కలిగించి, బ్రహ్మ శత్రువు, యజ్ఞ శత్రువు, మునిశత్రువు, సాధుశత్రువు అనే పేర్లను వీరు పొందారు. ఈ విధంగా వీరు సంపాదించిన నామాలు, భగవానుని

సహస్రనామాల కంటే ఎక్కువ – అని చమత్కరిస్తూ అంటారు, మన పూర్వాచార్యులు.

**"ఇలంగై పాళ్పడుక్క ఎణ్ణి"** (పెరియ తిరుమొழி– 5 –7– 7)

**లంకానగరాన్ని నాశనం చేయాలని తలచి**,

"శ్మశానసదృశీ భవేత్" అని సీతాదేవి పలికిన విధంగా, లంకానగరాన్ని శ్మశాన భూమితో సమానంగా చేయాలని భావించి.

ఇకపై "ధర్మ సంస్థాపనార్థాయ" అనే మూడవ అవతారప్రయోజనం సూచింపబడుతున్నది.

**"మణ్ణులగత్తోర్ ఉయ్య" (పెరుమాళ్ తిరుమొழி–1–10)**

**భూలోకంలో ఉండేవారు తరించేటట్లుగా.**

ఈ భూలోకంలో నివసించే మనవంటివారు అందరూ తరించేటట్లుగా శ్రీరాముడు అవతరించాడు. భగవానుడు శ్రీరాముడై అవతరించి,తన స్వరూపరూప గుణ విశేషాలతో ఈ లోకంలో ఉండే వారిని అందరిని ఆనందపరచి, తాను సన్మార్గాలలో ప్రవర్తించి తద్వారా లోకానికి వాటిని ఉపదేశించి, సద్ధర్మప్రతిష్ఠాపనను చేశాడు. శరణాగత రక్షణమని ధర్మాన్ని ఆచరించి చూపించాడు. అందువల్లనే నమ్మాళ్వారులు కూడా "కఱ్పార్ ఇరామ పిరానై యల్లాల్ మற்றுమ్ కఱ్పరో" అని అన్నాడు.

ఇంతవరకు శ్రీరామావతార ప్రయోజనం తెలుపబడింది.

ఇకపై ఉండే మూడవ భాగంలో, భగవానుడు శ్రీరాముడై ఏవిధంగా, ఎవరికి, ఎక్కడ అవతరించాడో, అతని రూపం ఎటువంటిదో, ఆ క్రమం తెలుపబడుతున్నది.

**"అయోత్తి ఎన్నుమ్ అణి నగరత్తు వెంగదిరోన్ కులత్తుక్కోర్ విళక్కాయ్"** (పెరుమాళ్ తిరుమొழி– 10–1)

**అయోధ్య అనే అందమైన నగరంలో సూర్యవంశానికి సాటి లేని దీపమై**,

ఇంతకుముందు తెలుపబడిన మూడు విధాలైన అవతార ప్రయోజనాలు సిద్ధించడం కోసం భగవానుడు అయోధ్య అనే అందమైన నగరంలో అవతరించాడు. ఈ అయోధ్య నగరం ఎటువంటిది అంటే, "దేవానాం పూ రయోధ్యా, అపరాజితా" అని వేదంలో కీర్తింపబడే పరమపదం వలే శత్రువులకు ఎవ్వరికి ప్రవేశించడానికి నగరం, ఇది. అయోధ్య అనే పదానికి "ఇతరులు ఎవ్వరూ ప్రవేశించడానికి సాధ్యం కానిది" అని అర్థం. దీనికే అపరాజిత అని పేరు. అంటే, ఎవరికీ ముట్టడించడానికి సాధ్యం కానిది అని అర్థం. భూలోకంలోని శ్రీరాముడు అవతరించిన నగరం కూడా అటువంటిదే కనుక, దానికి అయోధ్య అని పేరు. అంటే పరమపదంతో సమానమైనది అని తాత్పర్యం. ఇక్కడ "ఎన్నుమ్" అనే పదప్రయోగం వల్ల ఈ అయోధ్యా నగర ప్రశస్తి సర్వలోక విదితమైనది అనే అర్థం సూచింపబడింది. దీనివల్ల ఈ నగరానికి కల కీర్తి చాలా గొప్పది అని సూచింపబడింది. ఈ నగర సౌందర్యాతిశయం "అణి" అనే విశేషణం ద్వారా ఇక్కడ సూచింపబడింది.

అందంగాను, చక్కగా అలంకరింపబడి ఉండడవల్ల ఈ నగరానికి ఈ విశేషణం సార్ధకం.

శ్రీరాముడు సూర్యవంశంలో ఎందుకు అవతరించాడు అంటే, సూర్యుడు ఈ లోకంలోని చీకట్లను అన్నిటిని పోగొడతాడు. తాను కూడా ఈ లోకంలో ఉండే అందరి దుఃఖాలు అనే చీకట్లను పోగొట్టడం కోసం అవతరించదలచాడు కనుక, అటువంటి స్వభావాన్నే కలిగిన సూర్యుని వంశంలో అవతరించాడు అని అన్నారు, శ్రీకృష్ణసూరి. మనకు కల అజ్ఞానం అనే చీకట్లను పోగొట్టి జ్ఞానం అనే ప్రకాశాన్ని ఇవ్వడం కోసం, అదే స్వభావాన్ని కలిగిన సూర్యుని వంశంలో అవతరించాడు. ఆ వంశంలో "ఓర్ విళక్కు" – అద్వితీయమైన దీపంగా శ్రీరాముడు అవతరించడం అంటే, సూర్యుని కాంతి పగటి వేళ మాత్రం ప్రకాశిస్తుంది, రాత్రివేళ ప్రకాశించదు. కానీ, ఈ శ్రీరాముడు అనే ఆదిత్యుని కాంతి ఆ విధమైన కాలనియమం లేకుండా, ఎల్లప్పుడూ ప్రకాశిస్తుంది. అందువల్ల, శ్రీరాముడు ఒక విలక్షణమైన అద్వితీయమైన దీపం అని అన్నారు శ్రీకృష్ణసూరి. అంతే కాదు సూర్యవంశనికి అంతకు ముందు లేని అపూర్వమైన వైభవం తన అవతార విశేషం వల్ల ఏర్పడేటట్లు చేసినవాడు కనుక, శ్రీరాముడు ఇక్కడ ఒక విలక్షణమైన దీపంగా చెప్పబడ్డాడు.

**"కౌశలై తన్ కుల మదలైయాయ్"**

(పెరుమాళ్ తిరుమొழி– 8–3)

**కౌసల్యాదేవి కులానికి అద్వితీయ పుత్రుడై**,

కౌసల్యాదేవి కులం అంటే ఇక్ష్వాకు కులమే. ఆ కులంలో అవతరించిన అద్వితీయమైన పుత్రుడు శ్రీరాముడు.

**"దయరతన్ తన్ మగనాయ్ త్తోన్ఱి"**

(పెరుమాళ్తిరుమొழி–10–11)

**దశరథచక్రవర్తికి కుమారుడై అవతరించి,**

దశరథుని తనకు తండ్రిగా భగవానుడే వరించాడు– అనే విషయాన్ని శ్రీరామాయణం "పితరం రోచయామాస" అని తెలిపింది కదా. "త్తోన్ఱి" పదప్రయోగం వల్ల, రాముని అవతారం ఈ లోకంలో ఉండే జీవుల జన్మవంటిది కాదని, కర్మకృతం కాదని, కేవలం భగవంతుని సంకల్ప మూలకమైనదని సూచింపబడినది.

**"కుణమ్ తిగழ் కొండలాయ్"**

(ఇరామానుశ నూற்றన్దాది –60)

**కళ్యాణగుణాలు ప్రకాశించే మేఘంవంటివాడై,**

శ్రీరామునిలో ప్రధానంగా ప్రకాశించే 16 కళ్యాణ గుణాలను వాల్మీకి మహర్షి శ్రీరామాయణం ఆరంభంలో ప్రస్తావించిన వైనం ప్రసిద్ధం. శ్రీరాముని చరిత్ర పూర్ణంగా ఈ 16 గుణాల వివరణాత్మకమైనదే అని మన పూర్వాచార్యుల అభిప్రాయం. "కుణమ్ తిగழ்" అనే విశేషణ ప్రయోగం వల్ల, "ఈ గుణాల వల్ల శ్రీరామునకు అపూర్వమైన ఆధిక్యం ఏమీ కలుగలేదు, శ్రీరాముని ఆశ్రయించినందు వల్ల ఆ గుణాలకే అపూర్వమైన అతిశయం సిద్ధించింది" అనే అర్థవిశేషం ప్రకాశిస్తున్నది. మేఘం జలస్థలవిభాగం అనేది

ఏమీ లేకుండా, మేఘం తన నీటిని అన్ని చోట్ల వర్షించినట్లుగానే, శ్రీరాముడు కూడా తన కల్యాణ గుణాలను అందరి విషయం వర్షించాడు. తన కరుణా గుణాన్ని అందరి విషయంలోనూ చూపించాడు. అందువల్ల అతడు మేఘంవంటివాడు. శ్రీరాముడు లక్ష్మణుని విషయంలో, సుగ్రీవుని విషయంలో, గుహుని విషయంలో, శబరి విషయంలో, చివరకు రాక్షసకులానికి చెందిన విభీషణుని విషయంలో, తిర్యక్కు అయిన జటాయువు విషయంలో, అందరి విషయంలోనూ ఒకే విధంగా తన కరుణాగుణాన్ని ప్రకాశింప చేశాడు. అందువల్ల అతడు " గుణమ్ తికழ் కొండల్"అయ్యాడు.

ఇకపై ఉండే నాల్గవ భాగంలో శ్రీరామావతారంలోని ముఖ్యప్రయోజనం సూచింపబడుతున్నది, ఆ అవతారంలో ముఖ్య ప్రయోజనం యాగసంరక్షణం. యాగసంభవుడైన శ్రీరాముడు యాగసంరక్షణనే తన అవతార ప్రయోజనంగా కలిగినవాడు.

**"మందిరంగొళ్ మఱైమునివన్ వేళ్వి కాక్క"**

(పెరుమాళ్ తిరుమొழி–10–2)

**అన్ని మంత్రాలను తనలో ఇముడ్చుకున్న వేదాల మార్గంలో విశ్వామిత్ర మహాముని చేసే యాగాన్ని సంరక్షించడం కోసం.**

ఇప్పుడు శ్రీరాముడై అవతరించిన భగవానుడు చేసిన మొట్టమొదటి లీల ప్రస్తావించబడుతున్నది. భాగవతం మొదలైన పురాణాలలో శ్రీకృష్ణుని బాల్య లీలల వర్ణన విశేషంగా గోచరిస్తుంది. కానీ, శ్రీరామాయణంలో

శ్రీరాముని బాల్య లీలల ప్రస్తావన మనకు ఏమీ కనిపించదు. శ్రీరాముని మొట్టమొదటి లీల విశ్వామిత్ర యాగసంరక్షణం.

విశ్వామిత్ర మహర్షి గాయత్రీమంత్రాన్ని మొదటగా దర్శించి, లోకానికి అందించినవాడు. అందువల్ల అతడు "మందిరమ్ కొళ్ మఱై మునివన్" అని చెప్పబడ్డాడు. " గాయత్రీ ఛందసాం మాతా" అని అన్ని మంత్రాలకు తల్లిగా చెప్పబడేది కనుక, దీనిని పేరుతో నిర్దేశించకుండా, మంత్రశబ్దంతోనే నిర్దేశించడం జరిగింది. మంత్రం అంటేనే గాయత్రీమంత్రం. "కొళ్" అనే పదప్రయోగం వల్ల ఈ మంత్రం ఎల్లప్పుడూ ఉంటుంది అని, విశ్వామిత్రుడు దానిని దర్శించినవాడు మాత్రమే అని సూచింపబడింది.

సిద్ధాశ్రమం అనే చోట విశ్వామిత్రుడు చేసే యాగాన్ని రక్షించడంకోసం శ్రీరాముడు తన తమ్ముడైన లక్ష్మణునితో కలిసి, నడచి వెళ్ళాడు.

**"నడందు"** (పెరుమాళ్ తిరుమొழி –9– 2)

**బయలుదేరి నడచి వెళ్లి,**

**"వందు ఎదిర్ న్ద తాడకై తన్ ఉరత్తై క్కీఱి"**

(పెరుమాళ్ తిరుమొழி– 10–2)

**తనను ఎదిరించిన తాటక వక్షస్సును చీల్చి,**

తానే స్వయంగా వచ్చి ఎదిరించిన తాటకను వక్షస్సును శ్రీరాముడు భగ్నం చేశాడు. ఇక్కడ "తన్" అనే పదప్రయోగం వల్ల, ఈ తాటక

వంచనలోను, ఆకారంలోనూ, క్రూరత్వంలోనూ సాటి లేనిది అనే సంగతి సూచింపబడింది. దీనిని తిరుమంగై ఆళ్వారులు "తన్ నికర్ ఒన్జిల్లాద తాడకై" (తనకు సాటి ఎవరూ లేని తాటక) అని అనడం ద్వారా తెలియజేశారు. తన విషయంలో విరోధ భావాన్ని కలిగిన ఆమె వక్షస్సును శ్రీరాముడు భగ్నం చేశాడు. సాధువులను హింసించాలని, తనను ద్వేషించాలని భావించిన ఆమె హృదయాన్ని శ్రీరాముడు చీల్చివేశాడు.

**"వల్లరక్కర్ ఉయిరుండు"** (పెరుమాళ్ తిరుమొళి– 10–2)

**బలాన్ని కలిగిన రాక్షసుల ప్రాణాలను హరించి**,

విశ్వామిత్రుడు చేసే యాగాన్ని పాడు చేయడం కోసం తాటక కుమారులైన సుబాహుడు,మారీచుడు అనే ఇద్దరు రాక్షసులు వచ్చి యాగాన్ని పాడు చేయాలని ప్రయత్నం చేశారు. వీరు ఇద్దరూ యజ్ఞ విఘ్నకారులు. ఈ విషయం "వల్లరక్కర్" అనే పదం సూచిస్తున్నది. వల్ల రక్కర్ అంటే బలాన్ని కలిగిన రాక్షసులు అని అర్థం. వీరు ఎంతటి బలాన్ని కలిగినవారు అంటే, యాగాలను పాడు చేయడం కోసం ఆవశ్యకమైన బలాన్ని కలిగినవారు. వీరిద్దరి ప్రాణాలను శ్రీరాముడు హరించాడు.

శ్రీరాముడు సుబాహువు ప్రాణాలనేకదా హరించాడు, మారీచుని తన బాణంతో దూరంగా ఎక్కడో సముద్రంలోపడేటట్లు చేశాడు కదా. మరి, ఈ ఇద్దరినీ సంహరించినట్లు పలకడంలో ఏమి తాత్పర్యం? అని అంటే, మారీచుడు బతికి ఉన్నప్పటికీ, అతడు రామభయంతో జీవచ్ఛవంగానే బతికాడు. అందువల్ల అతడు కూడా సంహరింపబడినట్లే –అని ఆళ్వారుల అభిప్రాయం. తాను ఏ విధంగా రామభయంతో బతికాడో, ఆ విషయాన్ని

మారీచుడే స్వయంగా రావణునకు,(అరణ్యకాండలో)తెలిపిన వైనం మనకు స్పష్టంగా గోచరిస్తుంది. అందువల్ల అతడు మృతప్రాయుడే.

**"కల్లె ప్పెణ్ణాక్కి"**

**రాయివలె అచేతనంగా పడి ఉండే గౌతమపత్ని అహల్యను మళ్లీ తన స్వస్వరూపాన్ని పొందేటట్లు చేసి,**

ఈ ప్రయోగం అళ్వార్ల దివ్యప్రబంధాలలో ఎక్కడా గోచరించడం లేదు. కానీ ఈ ప్రయోగాన్ని తెలియవచ్చాయి పెరియ వాచ్చాన్ పిళ్ళై కంబ రామాయణాన్ని అనుసరించి కూర్చి ఉండవచ్చునని పెద్దల అభిప్రాయం.

ఇంతవరకు నాలుగవ భాగం.

ఇకపై ఉండే ఐదవ భాగంలో, సీతాకళ్యాణ ప్రస్తావన చేయబడుతున్నది.

**"కారార్ తిణ్ శిలై ఇఱుత్తు, మైదిలియై మణమ్ పుణర్ న్దు"**

(పెరియ తిరుమొழி– 4–1–8)

**నల్లని, చేవను నిండుగా ఉండే శివధనుస్సును భగ్నం చేసి, మైథిలిని వివాహమాడి,**

ఈ సీతాకళ్యాణ ఘట్టాన్ని సంగ్రహంగా ప్రస్తావించినట్లు కనిపించినప్పటికీ, తాటక సంహారం మొదలుకొని ఉండే సందర్భాలు అన్ని ఈ సీతాకళ్యాణ వృత్తాంతంలోని భాగాలే. ఏ విధంగా అంటే, శ్రీరాముడు విధంగా దుష్టులను సంహరించి, సాధు సంరక్షణను చేసినందు వల్లనే సీతాదేవి సంతోషించి, శ్రీరాముని వివాహమాడింది. అందువల్ల ఈ సీతాకళ్యాణ ఘట్టానికి ముందు ప్రస్తావింపబడిన వృత్తాంతాలు అన్నీ దానికి అంగాలే.

ఇక, ఆఖవ భాగంలో పరశురాముని గర్వభంగం తెలుపబడుతున్నది.

**"ఇరుపత్తొరుకాల్ అరశు కళై కట్ట"**

(తిరువాయ్ మొழி– 6–2–10)

**ఇరవై ఒక్క మారులు క్షత్రియులను నిర్మూలించిన,**

తమ దుశ్చరిత్రలతో లోకానికి కంటకులుగా మారిన దుష్టక్షత్రియులను 21 మార్లు సంహరించినవాడు పరశురాముడు. సస్య క్షేత్రంలో సత్యం అభివృద్ధి కాకుండా పెరిగి అడ్డుపడే కలుపును వ్యవసాయదారుడు తీసివేసినట్లుగా, ఈ లోకాన్ని సంరక్షించే వ్యవసాయదారుని వంటివాడైన భగవానుడు జీవసస్యానికి అడ్డుగా పెరిగిన కలుపు మొక్కలవంటివారైన దుష్టక్షత్రియులను తన గండ్రగొడ్డలితో సంహరించి నిర్మూలించాడు.

**"మழுవాళి వెవ్వరి నట్చ్రిలై వాంగి వెన్టికొండు"**

(పెరుమాళ్ తిరుమొழி–10–3)

పరశురాముడు తన చేతిలో ధరించే ఆయుధం పరశువు. ఇతడు రోషగుణాన్ని ప్రధానంగా కలిగినవాడు. దానికి అనుగుణంగానే ఉండే పరశువు అనే ఆయుధాన్ని చేతిలో ధరించాడు. క్షత్రియులను 21 మారులు సంహరించడానికి ఉపయోగపడినందున "వెవ్వరి" అని, దర్శనీయమైన ఆకారాన్ని కలిగినది కనుక "నట్చ్రిలై" అని విశేషణాలు ప్రయోగింపబడ్డాయి. పరశురాముడు తన చేతిలో ధరించిన ధనుస్సు విష్ణు ధనుస్సు. ఆ ధనుస్సు అటువంటి గొప్పతనాన్ని కలిగినది. అది భగవంతుని స్వభావం వంటి స్వభావాన్ని కలిగినది. భగవంతుడు ఏ విధంగా శత్రువులకు భయకరంగాను భక్తులకూ దర్శనీయంగాను ఉంటాడో, ఆ స్వామి ధనుస్సు కూడా, శత్రువులకు భయాన్ని కలిగించే దిగాను భక్తులకు చూడదగినదిగాను

ఉంటుంది అనే అర్థాన్ని ఈ రెండు విశేషణాలు తెలుపుతున్నాయి. ఈ ధనుస్సును పరశురాముని చేతిలో నుండి శ్రీరాముడు గ్రహించాడు. స్వీకరించడంతో నిలువకుండా ఆ పరశురాముని జయించాడు.

పరశురాముని గొప్ప ధనుస్సును గ్రహించి, అతనిని జయించి,

**"అవన్ తవత్తై ము*ఱ్ఱు*మ్ శె*ఱ్ఱు*"**

(పెరుమాళ్ తిరుమొ**ழி**– 9 –9)

**అతడు చేసిన తపస్సును అంతటిని నిర్వీర్యం చేసి**,

పరశురాముని చేతిలోనుండి విష్ణు ధనుస్సును స్వీకరించిన శ్రీరాముడు ఆ వింటికి నారిని సంధించాడు. తాను సంధించిన ధనుస్సు ఊరికే పోకూడదు కనుక, దానికి తగిన లక్ష్యాన్ని చూపమని పరశురాముని అడిగాడు. అప్పుడు పరశురాముడు, తాను చేసిన తపస్సును శ్రీరాముని బాణప్రయోగానికి లక్ష్యంగా చేయవలసినదిని చెప్పగా, ఆ విధంగానే శ్రీరాముడు తన బాణాన్ని ప్రయోగించి పరశురాముడు చేసిన తపస్సును అంతటినీ భగ్నం చేసాడు.

**"అంబొనెడు మణిమాడ అయోత్తి ఎయ్ దు"**

(పెరుమాళ్ తిరుమొ**ழி**–10– 8)

**అందమైన, ఉన్నతంగా ఉండే, బంగారంతో, మణులతో నిర్మింపబడిన భవనాలను కల అయోధ్యా నగరానికి చేరి**,

నూతన దంపతులైన సీతారాములు అయోధ్యా నగరానికి చేరారు. ఈ నగరం ఏ విధంగా ఉన్నదంటే, అందమైన బంగారంతోను, చాలా విలువైన మణులతోనూ నిర్మింపబడిన భవనాలతో కూడి ఉన్నది. అటువంటి అందమైన అయోధ్యా నగరంలో సీతారాములు సుఖంగా కాలాన్ని గడిపారు.

★★★★★

# అయోధ్యాకాండమ్

ఈ కాండలో కూర్చిన ప్రయోగాలను ఐదు విభాగాలుగా విభాగం చేయవచ్చు.

వీటిలో, మొదటి విభాగం, కైకేయి దశరథుని దగ్గర రెండు వరాలను కోరడం. పూర్వం ఎప్పుడో తనకు ఇస్తానని మాట ఇచ్చిన రెండు వరాలను కైకేయి ఇప్పుడు దశరథుని అడుగుతున్నది.

**"అరియణై మేల్ మన్నన్ ఆవాన్ నిఱ్క"**

(పెరుమాళ్ తిరుమొழி– 9–1)

**రాజసింహాసనంలో పట్టాభిషిక్తుడు కావడనికి సిద్ధమై ఉండగా,**

రాజసింహాసనంలో పట్టాభిషిక్తుడు కావడానికి శ్రీరాముడు నిర్వర్తించవలసిన పూర్వరంగాన్ని అంతటిని నిర్వర్తించి పూర్తిచేశాడు " అనే సంగతి "మన్ననావాన్ నిఱ్క" అనే ప్రయోగం వల్ల సూచింపబడింది. ఈ ప్రయోగాన్ని శ్రీకృష్ణసూరి వ్యాఖ్యానిస్తూ, "పట్టాభిషేక మహోత్సవానికి పూర్వ రంగాంగా చేయవలసిన కార్యకలాపాలను అన్నిటినీ వశిష్టుడు శ్రీరాముని చేత పూర్తి చేయించి, దానికి అంగంగా కంకణ ధారణను కూడా చేయించగా" అని వివరించారు. అభిషేకానికి ఆవశ్యకమైన వైదిక క్రియాకలాపాన్ని అంతటిని నిర్వహించేవాడు, వశిష్ఠుడు. దానికి తగిన ఏర్పాట్లను చేసేవాడు సుమంత్రుడు. పట్టాభిషేకం చేయాలని నిశ్చయించినవాడు దశరథుడు.

మీరందరూ సామాన్యులు కారు. అందువల్ల పట్టాభిషేక మహోత్సవం జరిగి పూర్తి అయినట్లే అని భావించారు, అందరూ. ఈ భావం "మన్ననావాన్ నిఱ్క" అనే ప్రయోగం వల్ల ధ్వనిస్తున్నది. అప్పుడే కైకేయి మంథర దుర్బోధనను విని దశరథుని దగ్గర రెండు వరాలను అడిగింది.

**"కొంగై వన్ కూని శొఱ్కొండు"**

(పెరియాళ్వార్ తిరుమొళి –2–1–8)

**స్తనాలను, గొప్ప గూనిని కలిగిన మంథర మాటను పురస్కరించుకొని,**

ఈ ప్రయోగాన్ని శ్రీవరవరమునులు వ్యాఖ్యానిస్తూ, "ఆమెకు గూనితనం ఎంత ఎక్కువగా ఉన్నదో, ఆమె హృదయంలో శ్రీరాముని విషయంలో విరోధ భావం కూడా అంత ఎక్కువగా ఉన్నది" అని అన్నారు.

ఆమెకు శ్రీరాముని పైన అంత ద్వేషం కలగడానికి ఏమి కారణం? అనే విషయాన్ని నమ్మాళ్వారులు తిరువాయ్ మొళి ప్రబంధంలో " కూనేయ్ శిదైయ ఉండ విల్ నిఱత్తిల్ తెరిత్తాయ్ గోవిందా!" (1–5–5) అనే సూక్తి లో సూచించారు చిన్నప్పుడు శ్రీరాముడు విలువిద్యను నేర్చుకునే సమయంలో తన వింటికి పూల బంతిని సంధించి, వినోదంగా మంథర గూనిపై ప్రయోగించాడట. దీనివల్ల తనకు ఏ విధమైన బాధ కలుగకపోయినా, మంథర మనకు సహజంగా ఉండే దుష్టస్వభావం చేత దానినే ఒక కారణంగా చేసుకొని శ్రీరామునకు ఏ విధంగా అయినా అపకారం చేయాలి అని భావించి సమయం

కోసం ఎదురుచూస్తూ ఉన్నది. దశరథుడు శ్రీరామునకు పట్టాభిషేకం చేయాలని సంకల్పించగానే దానికి భంగం కలిగించాలని భావించి కైకేయిని శ్రీరాముని వనవాసం పంపించేటట్లుగా దశరథుని వరాన్ని అడిగేటట్లు ప్రోత్సహించి, పట్టాభిషేక ప్రయత్నానికి ఆటంకాన్ని కలిగించింది. ఆమె తన కాఠిన్యాన్ని మనసులోనే కాకుండా, తన మాటలో కూడా చూపించింది.

**"కొడియ" (పెరియాళ్వార్ తిరుమొళి–4–8–4)**

కఠినమైన మనసును కలిగిన

**"కైకేయి వరమ్ వేండ"**

(పెరియాళ్వార్ తిరుమొళి–3–10–3)

**కైకేయి వరాలను అడుగగా.**

ఈ సందర్భాన్ని శ్రీ వరవరమునులు తమ వ్యాఖ్యానంలో స్పష్టంగా వివరించారు. అంతకు ముందు శ్రీరామునిపై ఎంతో ప్రేమను కలిగిన కైకేయి మనసు. మంథర మాటలను వినగానే రాయివలె మారిపోయింది అనే అర్థం స్ఫురించేటట్లు " కొంగై వన్ కూని శొల్కొండు, కొడియ కైకేయి వరమ్ వేండ" అని ప్రయోగింపబడింది. వాస్తవానికి ఈ పట్టాభిషేక వృత్తాంతాన్ని దశరథుడు ముందుగా తనకు ప్రియపత్ని అయిన కైకేయికి ముందుగా చెప్పాలనే ఆశతో వచ్చాడు, కానీ, అతని ఆశ నిరాశ అయినది. కంబ మహాకవి కైకేయికి శ్రీరాముని పై ఉండే ప్రేమను తెలుపుతూ, శ్రీరాముడు పుట్టినది కౌసల్యకే అయినప్పటికీ,అతడు ముద్దుగా పెరిగినది కైకేయి ఒడిలోనే – అని

అన్నాడు. అటువంటి కైకేయి కూడా మంథర మాటలకు కఠినమైన మనసు కలిగినది అయినది. నా పుత్రుడైన భరతనకు పట్టాభిషేకం చేయాలి, శ్రీరాముని 14 సంవత్సరాల పాటు వనవాసానికి పంపించాలి" అని రెండు వరాలను అడిగింది– అని శ్రీ వరవరమునులు తమ వ్యాఖ్యానంలో వివరించారు. అంతవరకు శ్రీరాముని తన పుత్రునిగా భావించిన కైకేయి ఇప్పుడు, భరత్ అనే తన పుత్రునిగా భావిస్తున్నది. అంతే కాదు దశరథునితో చెప్పేటప్పుడు "మన కుమారుడైన భరతుడు అని అనకుండా, నా కుమారుడైన భరతుడు" అని అన్నది. ఈ విధంగా ఆమె స్వార్థమై పూర్ణమైన హృదయంతో పల్కడానికి కారణం, మంథర దుర్బోధయే.

**"అక్కడియ శొర్కేట్టు"** (పెరియాழ్వార్ తిరుమొழி–4–8–4)

**ఆ విధంగా కైకేయి పలికిన కఠినమైన మాటలను విని**,

"మలక్కియ మా మనత్తననాయ్ మన్నవనుమ్ మఱాదొழியు, కలత చెందిన గొప్ప మనసును కలవాడై, ప్రభువు అయిన దశరథుడు కూడా ఆమె మాటలను కాదనలేకపోగా",

శ్రీరాముని పై ఎంతో ప్రేమను కలిగి ఉండే కైకేయి మనస్సును మంథర కలత పొందించినట్లుగా, చాలా గొప్పదైనది అయినప్పటికీ కూడా దశరథుని మనస్సునకు అయితే మాటలు కలతను పొందిందించినవి. వశిష్ఠుడు మొదలైన మహానుభావుల వచనాలను ఆలకించినందువల్ల, పలు యజ్ఞాలను చేసినందు వల్ల,ఎన్నో దానాలను చేసినందు వల్ల, ప్రజలకు

నిరంతరం హితాని కలుగజేసినందు వల్ల చాలా గొప్పదైన మనస్సును కల దశరథుని మనస్సును కలత పొందించడం అంత సులభమైన పని కాదు. కానీ, అటువంటి దశరథుని మనస్సు కూడా కైకేయి మాటలకు కలతను పొందింది. అందువల్ల అతడు ఆమె మాటలను కాదనలేకపోయాడు. తనకు ఇష్టం లేకపోయినా, కైకేయి మాటలను కాదనలేక, శ్రీరాముని అడవులకు పంపించవలసి వచ్చింది. శ్రీరాముడు అనే నిజమైన ధర్మాన్ని అతడు గుర్తించలేక, సత్యమనే ఆభాస ధర్మాన్ని మాత్రమే అతడు ఆశ్రయించాడు. ఈ విధమైన భ్రాంతి అతని జ్ఞానంలో ఏర్పడడానికి కారణం, కైకేయి మాటల వలన కలిగిన అజ్ఞానమే. శ్రీరాముని అడవులకు పంపించడానికి అతడు మనస్ఫూర్తిగా ఏ విధంగా అంగీకరించలేకపోయాడో, ఆ విధంగానే, అతడు కైకేయి మాటలను కూడా తిరస్కరించలేకపోయాడు. మౌనం అర్ధాంగీకారం కనుక, దానినే దశరథుని సమ్మతిగా కైకేయి గ్రహించింది.

**"క్కులక్కుమరా! కాడుఱైయ పో్పో ఎన్ఱు విడై కొడుప్ప"**

(పెరియాళ్వార్ తిరుమొళి– 3 –10 –3)

**"కులం తరించేటట్లుగా అవతరించిన కుమారా! నీవు వనంలో నివసించడానికి బయలుదేరి వెళ్ళు" అని ఆజ్ఞను ఇవ్వగా.**

మరునాడు, దశరథుని మాట పైన సుమంత్రుని పిలిపించి, అతని ఆజ్ఞగా తన వరాలను అతనికి తెలియజేసింది. అయితే ఈ మాటలను కాదనలేని స్థితిలో దీనావస్థలో ఉండే దశరథుడు మోహాన్ని పొందాడు.

అయితే సుమంత్రుని ద్వారా శ్రీరాముని దశరథుని మాటగా తన గృహానికి పిలిపించి, దశరథుని తాను అడిగిన రెండు వరాలను గూర్చి తెలియజేసింది. ఇక్కడ సూక్తిలో చెప్పిన మాటలు, సాక్షాత్తు దశరథుడు శ్రీరాముని ఉద్దేశించి చెప్పిన మాటలు కాదు. దశరథుని మాటలుగా కైకేయి శ్రీరామునితో పలికిన మాటలు, ఇవి.

తండ్రి మోహంలో మునిగిన స్థితిని చూసి శ్రీరాముడు బాధపడి, దానికి కల కారణాన్ని కైకేయిని అడుగగా, ఆమె అప్పుడు అతనికి జరిగిన సంఘటనను తెలియజేసి, అతనిని వనవాసానికి వెళ్ళమని ఆజ్ఞాపించింది." శ్రీరాముని 14 సంవత్సరాల వనవాసం, భరతుని పట్టాభిషేకం " అనే తాను అడిగిన రెండు పరాలను గూర్చి శ్రీరామునకు తెలుపగా సత్య ధర్మ ప్రవర్తకుడు కనుక, రాముడు వెంటనే ఆమె మాటలకు అంగీకరించాడు. " నీ తండ్రిని మాట తప్పనివానినిగా చేయాలని నీవు అనుకుంటే, నేను చెప్పినట్లుగా నీవు వనవాసానికి వెళ్ళాలి" అని అన్నది, కైకేయి. శ్రీరాముడు, రెండవ మాటను చెప్పకుండా, వెంటనే ఆమె మాటలకు అంగీకరించాడు.

ఇక్కడ నుండి రెండవ విభాగం ప్రారంభమవుతున్నది. ఇందులో, శ్రీరాముడు వనవాసానికి బయలుదేరడం తెలుపబడుతున్నది.

**"ఇన్నిలత్తై వేండాదు"** (పెరుమాళ్ తిరుమొழி– 9 –2)

**ఈ భూమిని కోరుకుండా**,

తనను వనవాసానికి వెళ్ళమని అజ్ఞాపిస్తూ పలికిన కైకేయి మాటలకు ఏమాత్రం బాధపడకుండా, " వనవాసో మహోదయః" అనే విధంగా అదే గొప్ప

అవకాశంగా భావించి, శ్రీరాముడు వనానికి బయలుదేరాడు. ఆ సమయంలో శ్రీరాముని ముఖం అందమైన, అప్పుడే వికసించిన, ఎర్రని తామర పువ్వునుకూడా జయించినది –అని అన్నాడు, కంబమహాకవి. తండ్రి తనకు ఇస్తానని మాట ఇచ్చిన రాజ్యాన్ని సైతం ఏమాత్రం ఆశించకుండా, మనసులో ఏ విధమైన కాలుష్యాన్ని పొందకుండా, శ్రీరాముడు వనవాసానికి బయలుదేరాడు. నిజమైన కుమారుడు తన తండ్రి సొత్తుకు ఆశపడడు, తండ్రి కీర్తిని, వంశ ప్రతిష్టను రక్షించడమే పరమధర్మంగా, అదే తన కర్తవ్యం గా భావిస్తాడు– అని నిరూపించాడు, శ్రీరాముడు. " జీవతోః వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరిభోజనాత్, గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా" (తల్లిదండ్రులు బ్రతికి ఉన్నప్పుడు, వారి మాటను గౌరవించి, దాని ప్రకారం నడుచుకోవడం, ప్రతి సంవత్సరం వారు మరణించిన తిథిలో విశేషమైన అన్నదానాన్ని చేయడం, గయలో పిండప్రదానాన్ని చేయడం – ఈ అనే ఈ మూడిటి వల్ల పుత్రత్వం సిద్ధిస్తుంది) అని కదా, పురాణ వచనం,

శ్రీరాముడు వేటిని వదిలిపెట్టి వనానికి వెళ్ళాడో, ఇకపై ఆ వివరం తెలుపబడుతున్నది.

**"ఈన్రెడుత్త తాయరైయుమ్ ఇరాచ్చియముమ్ ఆంగొ౫ిన్దు"**

(పెరియా౫్వార్ తిరుమొ౫ి – 4– 8 –4)

**తనను కన్న తల్లి అయిన కౌసల్యాదేవిని, రాజ్యాన్ని వదిలిపెట్టి,**

కౌసల్యాదేవి, మొదట, శ్రీరాముని వనవాసానికి వెళ్ళవద్దని అన్నది. శాస్త్రప్రకారం చూస్తే తండ్రి మాట కంటే తల్లి మాటే ఎక్కువ ప్రమాణం. అందువల్ల, కౌసల్యాదేవి మాటనే శ్రీరాముడు అనుసరించవలసి ఉన్నది.

అప్పుడు శ్రీరాముడు "అమ్మా!నీవు చెప్పినది నిజం. తండ్రి మాట కంటే తల్లి మాటయే ఎక్కువ ప్రమాణం. కానీ, ఒక ధర్మాన్ని అనుసరించడం ప్రారంభిస్తే, ఆ ధర్మాన్ని మధ్యలో విడువడం కూడా తగదని ఆ శాస్త్రమే చెబుతున్నది కదా. తల్లి అయిన కైకేయి మాటలను విని,నేను వనవాసానికి వెళ్లడం అనే ధర్మాన్ని ఇంతకు ముందే స్వీకరించాను. ఇప్పుడు దానిని నేను విడువడం ధర్మం కాదు కదా" అని అన్నాడు. అప్పుడు కౌసల్య శ్రీరామునితో "ఆ విధంగా అయినట్లయితే,నేనే నీతో పాటు వనానికి వస్తాను. నువ్వు నీతో పాటు నన్నుతీసుకుని పో" అని అన్నది. అప్పుడు శ్రీరాముడు ఆమెతో" నీకు భర్త, నాకు తండ్రి అయిన దశరథుని విడచి, నీవు నాతోపాటు అరణ్యానికి రావడం అనేది నీకు ధర్మం కాదు కదా, నేను లేని సమయంలో రాజునూ రక్షించవలసిన బాధ్యత నీది కదా. నీవు నాతో రావడం తగదు" అని నివారించి, తనపై అంతటి ప్రేమను కలిగిన ఆమెను, రాజ్యాన్ని వదిలిపెట్టి వనవాసానికి బయలుదేరాడు.

"ఇన్నిలత్తై వేండాదే" అని ఇంతకు ముందే శ్రీరాముడు రాజ్యాన్ని వదిలిపెట్టిన విషయం ప్రస్తావించబడడం వల్ల, ఇక్కడ మళ్ళీ అదే విషయాన్ని ప్రస్తావించడం పునరుక్తి అవుతుంది కనుక, ఇక్కడ రాజ్యశబ్దానికి లక్షణయా రాజ్యంలో ఉండే ప్రజలు అనే అర్థాన్ని గ్రహించి, " తనను విడవడానికి ఇష్టపడని అయోధ్యానగరంలోని ప్రజలను కూడా వదిలిపెట్టి" –అనే అర్థాన్ని గ్రహించాలి. " తన కళ్యాణ గుణాలలో ఎంతో అభినివేశాన్ని పొందిన

అయోధ్యానగరంలోని స్థావర జంగమాలను అన్నిటిని వదిలిపెట్టి" – అని ఇక్కడ తాత్పర్యం. అయోధ్యానగరంలోని చరాచరాలు అన్నీ కూడా ఈ విధంగా శ్రీరాముని విషయంలో అభినివేశాన్ని పొందినవి కనుక, తన అవతార పరిసమాప్తి సమయంలో వాటిని కూడా తనతో పాటు అతడు వైకుంఠానికి తీసుకుని పోయాడు. " అయోత్తియిల్ వాழும் శరాశరమ్ ముற்றవుమ్ నఱ్వాలుక్కు ఉయ్ త్తనన్" అని అన్నారు, నమ్మాళ్వారులు. శ్రీరాముడు ఇంకా ఏమి వదిలి పెట్టాడు? అని అంటే,

**"మైవాయ కళిఱొழிన్ద మావొழிన్ద తేరొழிన్ద"**

(పెరుమాళ్ తిరుమొழி–9– 2)

**కాటుక కొండవలె చాలా పెద్దవి అయిన గజాల సైన్యాన్ని, అశ్వసైన్యాన్ని, రథాలను వదిలిపెట్టి. అంటే, చతురంగ బలాలను కలిగిన సైన్యాన్ని వదిలిపెట్టి అని తాత్పర్యం. తండ్రి మాటను రక్షించడం కంటే ఇవి ఏమీ విలువైనవిగా శ్రీరాముడు భావించలేదు.**

**"కలనణియాదే, కామరெழிల్ విழల్ ఉడుత్తు, అంగంగళ్ అழగు మాఱి"** (పెరుమాళ్ తిరుమழி– 9 –7)

**దివ్యాభరణాలను అలంకరించుకోకుండా, చూచే వారి దృష్టిని ఆకర్షించే విధంగా నారబట్టలను, వాటిని బంధిస్తూ దర్భలతో చేయబడిన దారాన్ని (విశ్వామిత్రాన్ని) నడుమునకు ధరించి, తన దివ్యాంగాలలో ఉండే సౌందర్యం మారగా,**

ఇంతకు ముందు అయోధ్యలో ఉన్నప్పుడు శ్రీరాముడు పలు దివ్యాభరణాలను అలంకరించుకున్న అందువల్ల, అతని తిరుమేని సౌందర్యంతో పాటు ఆభరణాల సౌందర్యం కూడా శ్రీరాముని రూపంలో ప్రకాశిస్తూ ఉన్నది. కానీ, శ్రీరాముడు ఇప్పుడు వనవాసానికి వెళుతున్న కారణంచేత వాటిని అన్నిటినీ విడసిపెట్టినందువల్ల, కేవలం దివ్య మంగళవిగ్రహంలోని సౌందర్యం మాత్రమే వెలుగుతున్నది. నాకు ముందు ఆభరణాలు ఆవరించినందువల్ల రూప సౌందర్యం పూర్తిగా బయటకు వ్యక్తం కాలేదు. కానీ, ఇప్పుడు అది పూర్తిగా వ్యక్తం అవుతున్నందువల్ల, ఆ స్వామి రూప సౌందర్యంతో మార్పు ఉన్నది. అంటే, పూర్ణంగా వ్యక్తమవుతున్నది. ఆ మార్పు అతిశయాన్నే కలిగిస్తున్నది. అందువల్ల ఇక్కడ "అంగంగళ్ అழకు మాఱి" అని చెప్పబడింది. ఇంతవరకు ఇంతటి అందం ఆభరణాల చేత అవరింపబడడానికి కారణం ఆ అండగానికి దృష్టి దోషం తగలకూడదు అని తప్ప, అంతకు ముందు లేని అందం కలగాలనే భావంతో ఆభరణాలు అలంకరింపబడలేదు

ఈ విధంగా విలక్షణమైన రూపసౌందర్యంతో వనవాసానికి వెళ్లిన శ్రీరాముని వెంట ఎవరు వెళ్లారు? అని అంటే,

**"మానమరు మెన్నోక్కి వైదేవి యిన్ తుణైయా"**

(పెరియ తిరుమొழి –11–5 –1)

**లేడి చూపులతో సమానమైన, సుకుమారమైన చూపులను కలిగిన సీతాదేవి ప్రియమైన సహచరి కాగా,**

లేడి చూపులు ఏ విధంగా సుకుమారమై, చాంచల్యాన్ని కలిగినవై ఉంటాయో, సీతాదేవి కన్నులు కూడా ఆ విధంగానే సుకుమారంగా ఉన్నాయి కనుక, ఆమె కన్నులు లేడి కన్నులతో పోల్చబడ్డాయి. ఇక్కడ చూపులు మాత్రం చెప్పబడడం, ఆమె మిగిలిన దివ్యాంగాల సౌకుమార్యానికి ఉపలక్షణం. ఇంతటి సౌకుమార్యాన్ని కలిగిన సీతాదేవి కూడా రాముడు వనవాసానికి వెళ్ళిన సందర్భంలో ఏమన్నది అంటే, "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" (అరణ్యంలోని దారులలో ఉండే దర్భలను, ముళ్ళను ఏరివేస్తూ, ఆ దారులను సుగమం చేస్తూ, నీ కంటే ముందు నేను వెళతాను) అని అన్నది. శ్రీరాముడు, ఒకవేళ వనవాసానికి వెళ్లినప్పటికీ, సీతాదేవి సౌకుమార్యాన్ని చూస్తే, ఆమె వనవాసానికి వెళ్ళదగినది కాదు. అటువంటి సీతాదేవి కూడా వెంట రాగా,

సీతాదేవితో పాటు ఇంకా ఎవరు శ్రీరాముని వెంట అరణ్యానికి వెళ్లారు? అని అంటే,

**"ఇళంగోవుమ్"** (పెరుమాళ్ తిరుమొழி– 9– 2)

శ్రీరాముడు ప్రభువుగా పట్టాభిషిక్తుడు అయితే, యువరాజ పట్టాభిషేకానికి అర్హుడైనవాడు, లక్ష్మణుడు అటువంటి, యువరాజు కావలసిన లక్ష్మణుడు శ్రీరాముని వెంట వెళ్లాడు. లక్ష్మణుడు వనవాసానికి

ఎంతగా సిద్ధపడ్డాడు అంటే, " ప్రాగేవ తు మహాభాగః సౌమిత్రిః మిత్రనందనః, పూర్వజస్యానుయాత్రాయాం ద్రుమచీరై రలంకృతః" (తన అన్నగారైన శ్రీరాముడు వనవాసానికి సిద్ధం కావడానికి ముందుగానే, మిత్రులకు ఆనందం కలిగించే సుమిత్రానందనుడైన లక్ష్మణుడు నారబట్టలను కట్టుకొని వనవాసానికి సిద్ధం అయ్యాడు) అనే విధంగా శ్రీరాముని కంటే ముందుగానే సిద్ధపడ్డాడు. "భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే" (శ్రీరామా! నీవు సీతాదేవితో పాటు కొండ చరియలలో విహరించేటప్పుడు, నిద్రపోయేటప్పుడు నేను నీకు అన్ని విధాలయిన సేవలను చేస్తాను)

లక్ష్మణుడు ఏ విధంగా శ్రీరాముని అనుసరించాడు? అంటే

**"వాళుమ్ విల్లుమ్ కొండు పిన్ శెల్ల"**

(తిరువాయ్ మొழி– 8 –3–3)

**కత్తిని, వింటిని తీసికొని వెంట రాగా,**

"పిన్ శెల్ల" అని అన్నందు వల్ల సీతారాముల వెంట లక్ష్మణుడు వెళ్లాడు – అని తెలుస్తున్నది. అన్ని విధాలయిన సేవలను చేసే లక్ష్మణుడు వెంట వెళ్ళినందువల్ల బంధువులందరూ వెంట వెళ్లినట్లు అయినది – అనే అర్థంలో కులశేఖరులు " శுற்ற మెల్లామ్ పిన్ తుడర తొల్ కాన మడైందవనే!" (చుట్టాలు అందరూ వెంట రాగా, పూర్వం అరణ్యానికి వెళ్ళినవాడా!) అని అన్నారు.

ఈ విధంగా ముందుగా శ్రీరాముడు, అతని వెనుక సీతాదేవి, వారిద్దరి వెనుక లక్ష్మణుడు, వెళ్లినట్లు చెప్పబడింది. ఈ విషయాన్ని శ్రీరామాయణం " అగ్రతః ప్రయయౌ రామః సీతామధ్యే సుమధ్యమా, పృష్ఠత స్తు ధనుష్పాణిః లక్ష్మణో ఽ నుజగామ హ" అని తెలిపింది. ఈ క్రమం ప్రణవం నడిచి వెళుతూ ఉన్నట్లు ఉన్నదని మన పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. ప్రణవంలో కూడా, ముందు అకారంచేత చెప్పబడే భగవంతుడు మొదట, ఉకారం చేత చెప్పబడే సీతాదేవి మధ్యలో, మకారంచేత చెప్పబడే, జీవునకు ప్రతినిధి అయిన లక్ష్మణుడు చివరిలో నిర్దేశింపబడ్డారు కదా. వీరు ప్రవేశించిన అరణ్యం ఎటువంటిది అంటే,

**"కలైయుమ్ కరియుమ్ పరిమావుమ్ తిరియుమ్ కానమ్**
**కడందు పోయ్"** (**పెరియ తిరుమొழி**– 1–5–1)

**మృగాలు, ఏనుగులు, గుర్రాలు సంచరించే అరణ్యాలను దాటి వెళ్లి,**

ఇక్కడ ఈ జంతువులను ప్రస్తావించడం ఎందుకంటే, రాముడు సంచరించిన అరణ్యంలో మానవ మాత్ర సంచారం ఏ మాత్రం లేదు – అని సూచించడం కోసం. విజనవనంలో, అంటే, మానవులు ఎవ్వరూ లేని వనంలో, శ్రీరాముడు సంచరించాడు – అని శ్రీకృష్ణసూరి కూడా వ్యాఖ్యానించారు.

ఇంతవరకు రెండవ విభాగం.

ఇకపై మూడవ విభాగం తెలుపబడుతున్నది. ఇందులో, గుహునితో శ్రీరాముడు సఖ్యం చేసుకోవడం తెలుపబడుతున్నది.

**"పత్తియుడై క్కుగన్ కడత్త క్కంగై తన్నై క్కడందు"**

(పెరుమాళ్ తిరుమొழி–10– 4)

**తన విషయంలో గొప్ప భక్తిని కలిగిన గుహుడు దాటించిన గంగానదిని దాటి.**

గుహుడు, శ్రీరాముని విషయంలో అతని తమ్ముల కంటే ఎక్కువ భక్తిని కలిగినవాడు కనుకనే, " పత్తియుడన్ కుహన్" అని ప్రయోగించడం జరిగింది. గుహునకు శ్రీరాముని విషయంలో కల అతిశయించిన భక్తిని వ్యాఖ్యాత శ్రీకృష్ణ సూరి తెలుపుతూ, అతడు లక్ష్మణునివలె శ్రీరాముని విశ్లేషంలో జీవించలేనివాడు – అని అన్నారు. అయినప్పటికీ, శ్రీరాముని మాటను అనుసరించి నిలచిన భరతుని వలె, గుహుడు కూడా శ్రీరాముని మాటను అనుసరించి, అతనిని అనుసరించకుండా నిలచిపోయాడు. అందువల్ల అతడు భరతునితో పోలినవాడు. గుహునకు దూరంగా శ్రీరాముడు ఉన్నప్పటికీ, అతనికి శ్రీరాముని స్మరణ, అనుభవం, సాక్షాత్తుగా సంశ్లేషించి ఉన్నప్పుడు ఏర్పడినట్లుగా కలుగుతుంది – అని శ్రీరాముడు అతనిని అనుగ్రహించాడు. శ్రీరాముని మాటకు కట్టుబడి గుహుడు శృంగిబేర పురంలోనే నిలచిపోయాడు.అందువల్ల అతడు భరతునితో సమానుడు. శ్రీరాముని రాకకోసం భరతుడు వేచి ఉన్నట్లుగా, గుహుడు కూడా శ్రీరాముని

రాక కోసం వేచి ఉన్నాడు. శ్రీరాముడు కూడా, గుహనకు ఇచ్చిన తన మాటను నిజం చేస్తూ, వనవాసం పూర్తి చేసికొని, అయోధ్యకు చేరే ముందు గుహుని కలసి వెళ్ళాడు ఈ విషయాన్ని శ్రీకృష్ణ సూరి యుద్ధకాండలోని "శిరణింద గుహనోడు" అనే సూక్తి ద్వారా సూచించారు. అయోధ్యకు వెళ్లేటప్పుడు గుహని వెంటపెట్టుకొని శ్రీరాముడు వెళ్ళాడు. ఈ విధంగా శేషత్వంలో లక్ష్మణుని వంటివాడు, పారతంత్ర్యంలో భరతునివంటివాడు, గుహుడు.

ఈ విధంగానే, గుహుడు శత్రుఘ్నునివంటివాడు కూడా. శత్రుఘ్నుడు భాగవత భక్తిని కలిగినవాడు. భగవద్భక్తుడైన భరతుని విషయంలో భక్తిని కలిగినవాడు, అతడు. గుహుడు కూడా ఇటువంటివాడే. ఏ విధంగా అంటే, శ్రీరాముని అయోధ్యకు తిరిగి తీసుకొని రావాలని తన పరివారంతో పాటు బయలుదేరి వెళ్లే భరతుని చూసి గుహడు, అతడు శ్రీరాముని విషయం ఏదైనా అపకారం తలపెడుతున్నాడేమో అని సందేహపడ్డాడు. శ్రీరామునిపై తనకు ఉండే అతిశయించిన ప్రేమ కారణంగా, ఆ శ్రీరాముని భక్తుడైన భరతుని విషయంలో కూడా అస్థానే అతిశంకను పొందే స్వభావాన్ని కలిగినవాడు, గుహుడు. ఈ విధంగా గుహడు శ్రీరాముని పై లక్ష్మణుని కంటే, భరతుని కంటే, శత్రుఘ్నుని కంటే ఎక్కువ భక్తిని కలిగినవాడు.

**"వనమ్ పోయ్ ప్పుక్కు"**(పెరుమాళ్ తిరుమొ**ఝి**– 10–4)

**అరణ్యం లోపలకు పోయి ప్రవేశించి,**

**"క్కాయోడు నీడు కని యుండు"**

(పెరియ తిరుమొ**ఝి**–3–2–2)

**పచ్చి కాయలను, పండిన పండ్లను భుజించి.**

భుజించడానికి ఏమాత్రం సౌకర్యంగా ఉండని పచ్చికాయలను, చిరకాలం గాలిలో, ఎండలో ఎండి, ఏమాత్రం పచ్చదనం లేవి పండ్లను భుజించి.

అంతు లేని రాజభోగాలలో అనుభవిస్తూ ఉన్న శ్రీరాముడు ఈ విధంగా ఉండే ఆహారాన్ని భుజించి.

**"వియన్ కానమరత్తిన్ నీ**ఝ**ల్ కల్లణైమేల్ కణ్ తుయిన్దు"**

(పెరుమాళ్ తిరుమొ**ఝి**– 9 –3)

**చాలా క్రూరమైన అరణ్యంలో ఉండే వృక్షాల నీడలో, శిలల పైన నిద్రించి.**

ఆ వనప్రదేశాలు ఎంత భయంకరమైనవి అంటే, నిత్యం అరణ్యంలో నివసించే అరణ్యవాసులు కూడా ప్రవేశించడానికి సంచరించటానికి భయపడే భయంకరమైన వనప్రదేశాలు,అవి. అక్కడ ఉండే చెట్లు కూడా ఏ విధంగా ఉన్నాయి? అంటే, ఆకులు, శాఖలు లేకుండా, ఎండిపోయి ఉన్నాయి. ఆకులే లేని చెట్లు, అవి. అటువంటి చెట్ల నీడలలో శ్రీరాముడు శయనించాడు.

అటువంటి చోట్ల శిలాతలాలనే తల్పాలుగా చేసికొని నిద్రించాడు. ఈ విషయం శ్రీరామాయణంలోకూడా ప్రస్తావింపబడింది. అనవాసం ఆరంభమైన రెండవ నాడు వత్సదేశంలో, ఇంగుణ వృక్షచ్ఛాయలో శ్రీరాముడు విశ్రాంతి తీసుకుంటూ, లక్ష్మణునితో పలుకుతూ " లక్ష్మణా! నీవు నాతో పాటు ఇంత కఠినమైన అరణ్య ప్రాంతాలలో ఎందుకు నివసిస్తావు? నాతో పాటు ఎందుకు శ్రమ పడుతున్నావు? అయోధ్యకు వెళ్ళిపో. సీతతోపాటు నేను వనవాసాన్ని పూర్తి చేసుకుని తిరిగి వస్తాను"– అని అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు రామునితో " అన్నా!నిన్ను విడిచి నేను గాని, సీత గాని బ్రతికి ఉండలేము." అని బదులు పలికి, శ్రీరాముని అనుసరించాడు– అని శ్రీరామాయణంలో తెలుపబడింది.

**"శిత్తిరకూడ తిరుప్ప"** (పెరియాఝ్వార్ తిరుమొఝి–3–10– 6)

ఈ విధంగా వత్సదేశాన్ని దాటి, వనవాసాన్ని కొనసాగిస్తూ, చిత్రకూటంలో నివసిస్తూ ఉండగా. ఆ చిత్రపూట పర్వత ప్రాంతం "సుభగః చిత్రకూటో ౽ సౌ" అనే విధంగా అందమైన దృశ్యాలతో, ప్రదేశాలతో, తోటలతో, సెలయేళ్లతో, నదులతో నివాసయోగ్యమై, మందాకినీనది ప్రవహించే ప్రదేశమై, ఆ ముగ్గురికి ఆనందాన్ని కలిగించినది. అక్కడ లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాలలో ఆ ముగ్గురు సుఖంగా కాలాన్ని గడుపుతూ ఉన్నారు.

ఇప్పుడు నాల్గవ విభాగం తెలుపబడుతున్నది. ఇందులో, దశరథుడు స్వర్గానికి చేరడం తెలుపబడింది.

**“దయరతన్ తాన్” (పెరుమాళ్ తిరుమొழி– 9 –11)**

**దశరథుడు**

**“నిన్ మగన్మేల్ పழி విళైత్తిట్టు ఎన్నైయుమ్ నీళ్వానిల్ పోక్క ఎన్ పెற்றாయ్ కైకేశీ!” (పెరుమాళ్ తిరుమొழி– 9 –8)**

**“నీ కుమారునిపై అపనిందన కలిగించి, నన్ను కూడా విశాలమైన స్వర్గానికి వెళ్లే విధంగా చేయడం వల్ల నీవు ఏ లాభాన్ని పొందావు? కైకేయీ!”**

**“నానుమ్ వానగమే మిగ విరుంబి ప్పోగిన్టేన్”**

(పెరుమాళ్ తిరుమొழி – 9 –10)

**“నేను కూడా స్వర్గాన్ని మిక్కిలిగా కోరి వెళ్ళిపోతున్నాను”.**

**“ఎన్ను వానేఱ “ (తిరువాయ్ మొழி– 10– 6– 5)**

**అనే పలుకుతూ స్వర్గానికి చేరగా.**

శ్రీరామునితో పాటు దశరథుడు కూడా అరణ్యాలకు వెళ్లిపోవాలని కోరుకున్నప్పటికీ, అతడు శ్రీరామ విరహంతో మోహాన్ని పొందినందువల్ల, ఆ విధంగా వెళ్లలేకపోయాడు. అంతే కాకుండా, శ్రీరాముడు అరణ్యాలతో వెళ్లిపోయాడు, అతనితో పాటు లక్ష్మణుడు వెళ్ళాడు. భరతుడు, శత్రుఘ్నుడు అప్పటికి రాజ్యంలో లేరు. ఇటువంటి స్థితిలో తాను కూడా రాజ్యాన్ని వదిలిపెట్టి వెళ్లడం అనేది రాజధర్మం కాదు కనుక కూడా అతడు అరణ్యాలకు వెళ్ళలేకపోయాడు. ఈ విధంగా సామాన్య ధర్మాన్ని బట్టి, తన శరీరస్థితిని బట్టి దశరథుడు శ్రీరామునితో అరణ్యాలకు వెళ్ళలేకపోయాడు. అయోధ్యలోనే ఉండి పోయాడు, కానీ, ప్రాణాలను నిలుపుకోలేక, వాటిని

విడచి పెట్టి స్వర్గానికి చేరాడు. తన శరీరం అయోధ్యలో ఉన్నప్పటికీ, దృష్టి మాత్రం రాముని అనుసరించింది, " రామం మే ఽ నుగతా దృష్టిః" అని దశరథుడే స్వయంగా తెలిపాడు.

"కైకేయీ! నీ కుమారుడైన భరతునకు ఏనాటికి తీరని అపనిందును తీసుకొని వచ్చావు. నన్ను, శరీరాన్ని వదిలిపెట్టి స్వర్గానికి వెళ్ళేటట్లు చేశావు. ఈ విధంగా చేసినందు వల్ల నీకు ఏమి లాభం కలిగింది? నిన్ను తప్ప వేరొక తల్లిని తెలియని రాముని అరణ్యాలకు పంపించావు. అతనితో చాలదు అన్నట్లు లక్ష్మణునికూడా అరణ్యాలకు పంపించావు. భరతునకు భ్రాతృద్రోహి అనే అపనిందను కలిగించావు. నాకు మరణ దండనను ఇచ్చి, స్వర్గానికి వెళ్లేటట్లు చేశావు. నీవు కోరినట్లుగా భరతుడు రాజ్యాన్ని స్వీకరించడు. అందువల్ల, నీవు ఇంత చేసినప్పటికీ ఏమి లాభాన్ని పొందబోతున్నావు? నీ ఆశయం ఏ విధంగా సిద్ధిస్తుంది? " అనే భావం "ఎన్ పెற்றாయ్?"అనే సూక్తి వల్ల ధ్వనిస్తుంది.

ఈ అయోధ్య నగరం దస్వర్గం కంటే మిక్కిలి అందమైనదే కావచ్చు. కానీ ఇప్పుడు ఇది శ్రీరాముడు లేని అయోధ్య నగరం అందువల్ల నేను ఇక్కడ ఉండడానికి ఇష్టపడను ఇంతకంటే స్వర్గం తక్కువ సుఖాన్ని కలిగించేది అయినప్పటికీ, లోకంలో ఎవ్వరు శరీరాన్ని వదిలి వెళ్ళిపోవాలని కోరుకోనప్పటికీ, నేను శరీరాన్ని వదిలిపెట్టి ఆ స్వర్గాన్ని కోరి వెళ్ళిపోతున్నాను. శ్రీరాముడు లేని ఈ అయోధ్యా నగరం నాకు నివాసయోగ్యం కాదు" అనే భావం " నానుమ్ మిగ విరుంభి పోృగిన్టేన్" అనే సూక్తి వల్ల ధ్వనిస్తున్నది.

ఇక, చివరి విభాగం అయిన ఐదవ విభాగం ప్రారంభం అవుతున్నది. ఇందులో, పాదుకా పట్టాభిషేకం వృత్తాంతం ప్రస్తావింపబడుతున్నది.

**"తేనమరుమ్ పొழிల్ శారల్ శిత్తిరకూడత్తు"**

(పెరియాழ்వార్ తిరుమొழி– 3–10 – 5)

ఇందులో చిత్రకూట పర్వత ప్రాంత సౌందర్యం వర్ణింపబడుతున్నది. ఇక్కడ "తేన్" అనే పదం, తేనెను తాగి ఆనందించే తుమ్మెదను లక్షిస్తుంది. తుమ్మెదలు తేనెను తాగి ఆనందంగా ధ్వనించే తోటలను కలిగిన పర్వతచరియ ప్రాంతాలను కలిగిన చిత్రకూట పర్వతంలో. లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాలలో శ్రీరాముడు ఉన్నాడు. అతనిని ప్రార్థించి అయోధ్యకు తీసుకొని రావాలని ప్రయత్నంతో భరతుడు బయలుదేరారు.

**"ఆనై పురవి తేరోడు కాలాల్ అణి కొండ శేనై"**

(పెరియ తిరుమొழி–6–5–3)

శ్రీరాముని రాజలాంఛనాలతో తీసుకొని రావాలని భావించి భరతుడు, గజ, తురగ, రథ, పదాతి చతురంగబలాలతో కూడిన సేనను వెంటబెట్టుకొని వెళ్ళాడు

**"శుమందిరన్ వశిట్టరుడన్"(పెరుమాళ్ తిరుమొழி–9 –7)**

రాజ ధర్మంల్లో తలపండినవాడు, రాజ్యాన్ని నిర్వహించడంలో అనుభవాన్ని కలిగిన సుమంత్రుని, కుల గురువు, మంచి చెడ్డలను నిర్ణయించి తెలుపగలిగిన సమర్థుడు, రాజపురోహితుడైన, వశిష్టుని వెంటబెట్టుకొని వెళ్ళాడు.

**"బరతనంబి పణియ"**

(పెరియాழ்వార్ తిరుమొழி–3–10–5)

భగవత్పారతంత్ర్యగుణంలో పరిపూర్ణుడైన భరతుడు శ్రీరాముని సేవించి ప్రార్థించాడు. ఇక్కడ నంబి అనే విశేషణంవల్ల, భరతునకు కల విలక్షణ గుణమైన పారతంత్ర్యంలోని పూర్ణత తెలుపబడుతున్నది. అటువంటి భరతుడు శ్రీరాముని సేవించి, "రామా! నీవు అయోధ్యానగరానికి తిరిగి రావాలి" అని ప్రార్థించాడు.

**"తంబిక్కు మరవడియై వాన్బణయమ్ వైత్తు"**

(పెరియాழ்వార్ తిరుమొழி–4–9–1)

"14 సంవత్సరాల వనవాసం పూర్తి అయిన తరువాత తిరిగి అయోధ్యా నగరానికి రాగలను" అనే నమ్మకాన్ని భరతునకు కలిగించడం కోసం దానికి తగిన గొప్పదైన పణంగా, గొప్పదైన విశ్వాస హేతువుగా, తన పాదుకలను తమ్ముడైన భరతునకు శ్రీరాముడు ఇచ్చాడు. " నేను ఈ అయోధ్యా నగరానికి ప్రభువును కాను –అనే భావం నాలో నిత్యంగా స్థిరంగా ఉండడం కోసం, నీవు తప్పక 14 సంవత్సరాల తరువాత తిరిగి వస్తావు అనే నమ్మకం కలగడం కోసం, నాకు,ఏదైనా ఒక విశ్వాసాన్ని కలిగించే పణాన్ని ఇవ్వవలసినది" అని భరతుడు కోరగా, శ్రీరాముడు తన పాదుకలను అతనికి విశ్వాస హేతువుగా అనుగ్రహించాడు.

"శ్రీరాముడు తిరిగి వస్తాడు "అనే నమ్మకం కలగడం కోసం అతడు తన పాదుకలను గొప్ప విశ్వాస హేతువుగా, పణంగా భరతునకు ఇచ్చాడు అంటే, శ్రీరాముని కంటే ఆ పాదుకలు ఎక్కువ విలువ కలిగినవి అని కదా అర్థం. అందువల్ల భగవంతుని కంటే భగవంతుని పాదుకలు మిక్కిలి ప్రభావాన్ని కలిగినవి కనుక,ఇక్కడ "వాన్ పణైయమ్" అనే ప్రయోగం

చేయబడింది. కువలయ త్తుంగ క్కరియుమ్ పరియుమ్ ఇరాచ్చియముమ్ ఎంగుమ్ బరతక్కురుళి" (పెరియాழ்వార్ తిరుమొழி–2–1–8) భూమిలో చాలా గొప్పవి అయిన శత్రుంజయుడు మొదలైన గొప్ప గొప్ప ఏనుగులను,గొప్ప గుర్రాలను, భూమిలో అంతటా విస్తరించిన అఖండమైన రాజ్యాన్ని భరతనకు అనుగ్రహించాడు.. " శ్రీరాముడు వాలితో పలికేటప్పుడు "ఇక్ష్వాకూణా మీయం భూమిః సశైలవనకాననా" అని అంటూ ఈ భూమండలం సమస్తం ఇక్ష్వాకుల సామ్రాజ్యమే – అని అన్నాడు కదా.

**"విడై కొడుత్తు"**

భరతునకు అనుమతిని ఇచ్చి శ్రీరాముడు అతనిని పంపించి వేశాడు. కైకేయి కోరిన వరాల ప్రకారం, దశరథుడు అంగీకరించిన ప్రకారం, భరతునకు రాజ్యాన్ని ఇచ్చి అతనిని పంపించాడు.

**"తిరువుడైయ తిశై క్కరుమమ్ తిరుత్త ప్పోయ్"**

(పెరియాழ்వార్ తిరుమొழி–4–9–1)

జ్ఞానం,తపస్సు మొదలైన సంపదలను కలిగిన, మహా జ్ఞానులైన గొప్ప గొప్ప మునులు నివసించే దిక్కులో శరణాగత రక్షణం అనే తన ధర్మాన్ని నిర్వర్తించడం కోసం వెళ్లి.

**"దండకారణియమ్ పుగుందు"**

(పెరియ తిరుమొழி– 10 –2 –3)

**శ్రీరాముడు దండకారణ్యంలోకి ప్రవేశించాడు.**

★★★★★

# ఆరణ్యకాండమ్

ఈ కాండలో సంకలనం చేయబడిన ప్రయోగాలను ఎనిమిది భాగాలుగా విభజించవచ్చు.

వీటిలో మొదటి భాగం – శ్రీరాముడు దండకారణ్యంలో ప్రవేశించడం, దండకారణ్యంలో ఉండే మహర్షులు రాముని శరణాగతి చేయడం అనేది.

**"మట్రై మునివర్ క్కు"** (పెరుమాళ్ తిరుమొழி–10–2)

వేద ప్రతిపాద్యుడైన పరతత్వం శ్రీరాముడే అనే విషయాన్ని దండకారణ్యంలోని మహర్షులు అందరూ శ్రీరాముని తమను రక్షించమని శరణు వేడారు. " తే వై యం భవతా రక్ష్యాః భవద్విషయవాసినః, నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః" (శ్రీరామా! నీవు మేము ఉండే ఈ దండకారణ్యానికి వచ్చావు. నీవు మమ్ములను రక్షించవలసినవాడవు. . రాజ్యంలో ఉన్నా, నీవే రాజువు, వనంలో ఉన్నా, నీవే మాకు రక్షకుడవు నీవు మేము నివసించే ఈ అరణ్యానికి వచ్చి, దీనిని నీ రాజ్యంగా చేశావు. నీవల్లనే మేము రక్షింపబడవలసినవారము) అని శరణు వేడారు. మీ దేశంలో మేము నివసించడమే చాలు, నీవు మమ్ము రక్షించడానికి – అని మహర్షుల అభిప్రాయం. ఈ కారణం వల్లనే, శ్రీరాముడు, తరువాత తన అవతార పరిసమాప్తి సమయంలో, తన రాజ్యంలో ఉండే చేతనాచేతనాలను అన్నిటిని తనతో పాటు వైకుంఠానికి చేర్చాడు. ఇందువల్లనే భగవద్రామానుజులు కూడా తమ అవతార సమాప్తి సమయంలో మనకు అనుగ్రహించిన ఆరు

ముఖ్యమైన అంశాలలో, భగవానుడు అభిమానించి నివసించే దేశాలలో వాసం కూడా ఒకటి. ఈ విధంగా తనను శరణు వేడిన మహర్షులకు

**"అంజేల్మిన్!"** (శిఱియ తిరుమడల్) (24)

భయపడవద్దు

**"ఎన్ను విడై కొడుత్తు"** (పెరియాళ్వార్ తిరుమొళి– 4 –9 –3)

అని సమాధానాన్ని పలికి.

మహర్షి చేసిన శరణాగతి అంజలి రూపమైన శరణాగతి ముద్రకు సమాధానంగా శ్రీరాముడు తన అభయముద్రతో సమాధానాన్ని ఇచ్చాడు.

దండకారణ్యంలోని ఋషులను ఖర దూషణాది రాక్షసులు చాలా బాధను కలిగించారు. వారి బారినుండి మహర్షులకు రక్షణ కలిగిస్తానని శ్రీరాముడు ఆమహర్షులకు మాట ఇచ్చాడు. శ్రీరాముడు మహర్షులకు ఇచ్చిన మాట ఎంత స్థిరమైనది అనే విషయాన్ని తరువాత జరిగిన ఒక సందర్భం మనకు నిరూపిస్తున్నది.

మునులకు అభయాన్ని ఇచ్చిన రామునితో " శ్రీరామా! మనం ఈ వనానికి వనవాసం చేయడం కోసం వచ్చాము. ఇక్కడ ఉండే పుణ్యానదులలో స్నానం చేయవచ్చు. మునులతో వైదిక ధర్మాలను గురించి చర్చించవచ్చు. అంతే తప్ప, నీవు విధంగా ఎల్లప్పుడూ చేతిలో వింటిని, బాణాలను ధరించి తిరుగడం నాకు సవ్యంగా తోచలేదు. ఇది హింసకు కారణం అవుతుంది. అంతేకాకుండా, మునులకు నీవు అభయాన్ని ఇవ్వడం వల్ల మనకు అకారణంగా రాక్షసులతో వైరం ఏర్పడే ప్రమాదం ఉన్నది. ఇది అంతా మనకు అక్కరలేదు కదా? " అని సీత అన్నది. ఈ విధంగా సీతాదేవి పలుకడం

రాముని శరణాగత నిష్ఠ ఎంత స్థిరమైనది అని తెలుసుకోవడం కోసం తప్ప, అతనికి నిరుత్సాహ పరచడం కోసం కాదు.

అప్పుడు రాముడు ఆమెతో తన శరణాగత రక్షణ అనే ధర్మంలోని స్థిరమైన నిష్ఠను గూర్చి తెలుపుతూ, " అప్యహం జీవితం జహ్యామ్ త్వాం వా సీతే! సలక్ష్మణామ్, నహి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః" (ఓ సీతాదేవీ! నేను నా జీవితాన్ని వదిలిపెడతాను, నిన్ను కూడా వదిలిపెడతాను, లక్ష్మణుని కూడా వదిలిపెడతాను. అంతే తప్ప, నేను ఇచ్చిన మాటను, అందులోను, మునులకు ఇచ్చిన మాటను మాత్రం నేను విడచిపెట్టను) అని అన్నాడు. ఇది శ్రీరామునకు శరణాగత రక్షణ ధర్మం లోని అచంచలమైన దీక్షను తెలుపుతున్నది.

ఇక్కడ నుండి రెండవ భాగం ప్రారంభం అవుతున్నది. ఈ రెండవ భాగంలో విరాధవధ తెలుపబడింది.

**"వెంగణ్ విఱల్ విరాద నుగ విల్ కునిత్తు"**

(పెరియతిరుమొழி-3-4-6)

ఉగ్రమైన కన్నులను గొప్ప బలాన్ని కలిగిన విరాధుడు నశించేటట్లు వింటిని వంచి, బాణాన్ని ప్రయోగించి.

విరాధుడు సీతాదేవిని అపహరించాలని ప్రయత్నం చేశాడు. అతడు నశించేటట్లుగా శ్రీరాముడు అతనిపై బాణాలను ప్రయోగించాడు. తుంబురుడు అనే గంధర్వుడే కుబేరుడు ఇచ్చిన శాపవశంచేత విరాధరూపాన్ని పొందాడు అని అతని పూర్వ చరిత్ర తెలుపుతున్నది. శ్రీరామచంద్రుడు అతనిపై బాణాలను ప్రయోగించగానే అతనికి శాపం

ప్రభావం తీరి, నిజరూపాన్ని పొంది దేవలోకాన్ని చేరాడు. శ్రీరాముడు బాణాన్ని ప్రయోగించవలసిన ఆవశ్యకతయే లేదు, అతడు వింటిని వంచితే చాలు, కావలసిన కార్యం జరుగుతుంది – అనే అర్థం “విల్ కునిత్తు”అనే ప్రయోగం ద్వారా ధ్వనిస్తున్నది.

మూడవ భాగంలో – శ్రీరాముడు అగస్త్యముని దగ్గరనుండి విష్ణుధనుస్సును పొందడం తెలుపబడింది.

**“వండమిழ் మాముని కొడుత్త వరివిల్ వాంగి”**

(పెరుమాళ్ తిరుమొழி–10–5)

గొప్పదైన తమిళ భాషను ప్రవర్తింపచేసిన అగస్త్యముని ఇచ్చిన మనోహరమైన విష్ణుధనుస్సును గ్రహించి.

వ్యాకరణంలో, సాహిత్యంలో గొప్ప వైలక్ష్యణ్యాన్ని కలిగిన భాష ద్రావిడ భాష. దానిని అగస్త్య మహాముని దక్షిణ భారతదేశం లో ప్రచారం చేశాడు. అందుచేత ఆ మునికి ద్రావిడ ముని అని పేరు. అతడు ఆకారంలో చిన్నవాడు అయినప్పటికీ, ప్రభావంలో గొప్పవాడు కనుక, అతడు “మాముని” అని చెప్పబడ్డాడు.

విష్ణు ధనుస్సును శ్రీరాముడు మళ్లీ అగస్త్యమునినుండి ఏ విధంగా పొందాడో, ఆ వివరాన్ని తిరుమల నంబి రామానుజులకు తమ ప్రవచనంలో తెలియజేశారు. ఒక సంవత్సర కాలం పాటు తిరుమలనంబి సన్నిధిలో శ్రీరామానుజులు శ్రీరామాయణంలోని 18 విధాలైన అర్థతత్వాలను అధికరించారు అని సంప్రదాయం. సీతను వివాహమాడిన పిమ్మట శ్రీరాముడు, అయోధ్యా నగరానికి తిరిగి వెళుతూ, పరశురాముని దగ్గరనుండి

విష్ణు ధనుస్సును గ్రహించాడు. దానిని అతడు వరుణునకు ఇచ్చాడు –. అని బాలకాండలో తెలుపబడింది.

ఆ ధనుస్సును వరుణుడు అగస్త్యునకు ఇచ్చాడు. ఆ విష్ణుధనుస్సునే శ్రీరాముడు వనవాస సమయంలో అగస్త్యమునినుండి పొందాడు. అది సంవత్సరాల కాలం దండకారణ్యప్రాంతంలో నివసించిన తరువాత, 11 వ సంవత్సరంలో "అగస్త్య వచనాచ్చైవ" అని చెప్పినట్లుగా, ఈ అగస్త్యముని మాట ప్రకారమే శ్రీరాముడు జనస్థాన ప్రాంతంలోని పంచవట ప్రాంతాన్ని చేరి, అక్కడ నివాసం ఏర్పాటు చేసికొన్నాడు.

ఇపుడు, నాల్గవ భాగంలో శూర్పణఖ అంగభంగం తెలుపబడుతుది. అగస్త్యముని వచనానుసారంగా శ్రీరాముడు పంచవటీ ప్రాంతాన్ని చేరి, అక్కడ సుమారు మూడు సంవత్సరాల కాలం నివాసం ఉన్నాడు. ఆ తరువాత ఒకనాడు శూర్పణఖ శ్రీరాముని చూచి అతని దగ్గరకు వచ్చింది.

**"పులర్ న్దెழுన్ద కామత్తాల్"** (పెరియ తిరుమడల్ –145)

తీవ్రమైన కామం వల్ల,

శ్రీరాముని అవధి లేని సౌందర్యాన్ని చూడగానే, శూర్పణఖ మనస్సులో సముద్రానికి మించినంత కామం ఉప్పొంగింది.

**"శీదైక్కు నేరావన్ ఎన్ఱ"** (శిఱియ తిరుమడల్ –39)

"నేను సీతతో సమానురాలను" అని భావించి

"లక్ష్మీ స్వరూపిణి అయిన సీతాదేవితో నేను సమానమైనదానను" అని భావించి, ఆ సీతాదేవి స్థానంలో తాను ఉండాలని ఆశపడింది. భగవంతుని వైభవానికి మించిన వైభవాన్ని కలిగిన సీతాదేవితో తాను సమానురాలను అని ఆ రాక్షసి భావించింది. ఆమెను వధించి, ఆమె స్థానంలో తాను నిలవాలని భావించింది. పరమ పురుషుడైన శ్రీరాముని పొందడం

కోసం లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవిని పురుషకారంగా అశ్రయించి, ఆమెద్వారా శ్రీరాముని ఆశ్రయించవలసి ఉండగా, సీతాదేవిని ద్వేషించి, ఆమెను లేకుండా చేసి, ఆమె స్థానంలో తాను నిలవాలని భావించింది.

అందువల్ల, ఆమె ఆశ విఫలం కావడమే కాక, విపరీత ప్రయోజనాన్నికూడా కలిగించింది.

**"పొన్నిఱమ్ కొండ శుడు శినత్త శూర్ ప్పణకావై"**

(పెరియ తిరుమడల్ – 145)

శ్రీరాముడు తన కోరికను తిరస్కరించినందు వల్ల శరీరంలో పాలిపోయిన, వెలవెల పోయిన రంగును పొంది, ఎదుటివారి మనసును బాధించే కోపాన్ని కలిగిన శూర్పణఖను శ్రీరాముడు ఏకదారావ్రతుడు. అందువల్ల అతడు శూర్పణఖ ప్రార్ధనను అంగీకరించలేదు, తిరస్కరించాడు. తన కోరికను శ్రీరాముడు తిరస్కరించగానే తూర్పున శూర్పణఖ మనసులో నిరాశను, బాధను పొందింది. అందువల్ల ఆమె శరీరం పాలిపోయిన రంగును పొందింది. బాహ్యరూపంలోనే కాకుండా, మనసులో కూడా ఆ రక్కసి వికృతిని పొందింది. తన కోరికకు అడ్డు వచ్చి శ్రీరాముని పై, లక్ష్మణునిపై సీతపై ద్వేషభావం ఆమె మనసులో నిండుగా నిండిపోయింది. ఆమెను మింగి లేకుండా చేయాలని ప్రయత్నం చేసింది.

**"కొడి మూక్కుమ్ కాదిరండుమ్ కూరార్ న్ద వాళాల్ ఈరా విడుత్తు"**

(శిఱియ తిరుమడల్ –40)

టెక్కం వంటి ముక్కును, చెవులను, రెండిటిని, పదును కల కత్తితో ఖండించి, లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవి విషయంలో ఆమె అపచార

పడడానికి ప్రయత్నం చేయడాన్ని చూసిన లక్ష్మణుడు, సహించలేక ఆమెను తగిన రీతిలో శిక్షించాడు. పదునైన కత్తితో ఆమె ముక్కును, చెవులను ఖండించాడు.

శూర్పణఖ పరమ పురుషుడైన శ్రీరాముని పొందాలని ప్రయత్నం చేసింది. కానీ ఆమె పరమ భాగవతురాలైన లక్ష్మీదేవి విషయంలో తీరని, సహించరాని అపరాధం చేసింది. అందువల్ల విపరీత ఫలితాన్ని పొందింది దీనిని బట్టి, భగవంతుని విషయంలో ఎంతటి భక్తి ఉన్నప్పటికీ, భాగవతాపచారాన్ని చేసినట్లయితే, ఆ భక్తి ఫలించదు సరి కదా, విపరీత ఫలితాన్ని ఇస్తుంది అని సూచింపబడింది అని మన పూర్వాచార్యుల వివరణం. భగవంతుని పట్ల భక్తి ఉంటే చాలదు, ఆ భగవంతుని భజించే భక్తుల విషయంలో, జీవులకు పురుషకారం చేసే లక్ష్మీదేవి విషయంలో భక్తి ఉన్నప్పుడే ఆ భగవంతుని ఫలిస్తుంది అని దీనివల్ల ఏర్పడుతున్నది.

ఈ విధంగానే, రావణుడు పురుషకారస్వరూపిణి అయిన సీతాదేవిని పొందాలని ప్రయత్నించినా, ప్రాణ సమానుడైన భగవంతుని విరోధించాడు కనుక, తన ప్రాణాలనే పోగొట్టుకున్నాడు. విభీషణుడు, ఈ విధంగా కాకుండా, సీతా పురుషకార పూర్వకంగా శ్రీరాముని ఆశ్రయించినందున తరించాడు. అందువల్ల లక్ష్మీదేవితో కూడి ఉండే పరమ పురుషుడే మనకు ఉద్దేశ్యం అనే తత్వం ఇక్కడ వ్యక్తం అవుతున్నది.

"శ్రీరామాయణ కథాప్రకారం, లక్ష్మణుడు కదా శూర్పణఖ ముక్కు, చెవులను కోసినది, మరి, ఇక్కడ, శ్రీరాముడు ఖండించినట్లు చెప్పబడినదే!" అనే సందేహం కలుగవచ్చు. భాగవతాపచార, అసహ్యాపచారాలను చేసినవారిని భగవానుడు ఇతరుల ద్వారా శిక్షించకుండా, నేరుగా తన

దక్షిణహస్తంతోనే శిక్షిస్తాడు – అనే శాస్త్రార్థం ఇక్కడ సూచింపబడింది. అయితే, లక్ష్మణుడు, "రామస్య దక్షిణో బాహుః" అని అన్నట్లుగా, రామునకు కుడి భుజంవంటివాడు లక్ష్మణుడు కనుక, శూర్పణఖను లక్ష్మణుడు శిక్షించడం అంటే, రాముడు తన కుడి చేతితో శిక్షించినట్లే అవుతుంది కదా.

**"కరనోడు తూడణన్ తన్ ఉయిరై వాంగ"**

(పెరుమాళ్ తిరుమొழி– 10–5)

"ఖరునితో పాటు దూషణుని ప్రాణాలను కూడా హరించగా",

శూర్పణఖకు ఈ విధంగా అంగభంగం కలిగించిన వృత్తాంతాన్ని విని సహించలేక ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు మొదలైన 14వేల మంది రాక్షసులు శ్రీరాముని పైకి యుద్ధానికి వచ్చారు. వారిని అందరిని శ్రీరాముడు అసహాయ శూరుడై వధించాడు.

**"అవళ్ కదఱి, తలైయిల్ అంగై వైత్తు, మలై యిలంగై ఓడి ప్పుగ"**

(పెరియ తిరుమొழி– 3– 9 –4)

ఆ శూర్పణఖ గొంతెత్తి ఆక్రందిస్తూ, తలపై అరచేతులను పెట్టుకొని, కొండపై ఉన్న లంకలోనికి పారిపోయి ప్రవేశించగా,

తనకు జరిగిన అంగభంగానికి తగిన ప్రతీకారం చేయాలని ప్రయత్నం చేసిన ఖరుడు, దూషణుడు మొదలైన రాక్షసులు అందరూ రాముని చేతిలో వధింపబడడాన్ని చూసి సహించలేని శూర్పణఖ, అరచేతులను రెండిటినీ తలపై పెట్టుకుని ఏడుస్తూ, త్రికూట పర్వతంపై ఉండే, రావణుడు పాలించే లంకానగరాన్ని వేగంగా చేరింది. రావణునితో జరిగిన విషయాలను తెలియజేసి, దానికి తగిన ప్రతీకారాన్ని చేయమని కోరడం కోసం వెళ్ళింది.

ఇక్కడ నుండి 5వ భాగం తెలుపబడుతున్నది. ఇందులో సీతాపహరణం తెలుపబడింది.

**"కొడుమైయిల్ కడువిశై అరక్కన్"**

(పెరియ తిరుమొழி– 5– 7 –7)

లోకానికి హాని చేయడంలో చాలా వేగాన్ని కలిగిన రాక్షసుడు రావణుడు.

శూర్పణఖ లంక నగరంలోని రావణుని దగ్గరకు వచ్చింది,

**"అలై మలి వేల్ కణాళై అగల్విప్పాన్ ఓరురువాయ్ మానై యమైత్తు"**

(పెరియ తిరుమొழி– 11–4–7)

మనసును చలింప చేయగలిగిన, వేలాయుధంవంటి, ఘు అందమైన నేత్రాలను కలిగిన సీతాదేవిని శ్రీరాముని దగ్గర నుండి విడదీయడంకోసం. మారీచుడు అనే అసురుని ఒక, అద్వితీయమైన, బంగారు లేడి రూపంలో వచ్చేటట్లు చేసి, సీతాదేవి నేత్రసౌందర్యం అలౌకికమైనది. ఆమె నేత్రసౌందర్యాన్ని దర్శించినవారి మనసు ఆ అందంలో పూర్తిగా లగ్నం అవుతుంది. సీతాదేవి కటాక్షవైభవాన్ని గూర్చి వర్ణిస్తూ, ఆమె కటాక్షాలకు పాత్రమైవాడు ముల్లోకాలకు అధిపతి కాగలడు – అని అన్నది. సీతాదేవి నేత్రసౌందర్యాన్ని రావణునకు వర్ణించి చెప్పి, ఆమెను విధంగానైనా సరే, వశం చేసికొమ్మని లేకపోతే అతని జీవితం వ్యర్థమని ప్రేరేపించినది.

శూర్పణఖ పలికిన మాటలకు అంగీకరించిన రావణుడు సీతాదేవిని అపహరించాలని నిశ్చయించుకున్నాడు. తాటక కుమారుడైన మారీచుని దగ్గరకు వెళ్లి, సీతను అపహరించే ప్రయత్నంలో తనకు సహాయపడమని

కోరాడు. మొదట మారీచుడు, రావణుడు చేసే ఆ ప్రయత్నం తగదని రావణునకు హితాన్ని చెప్పాడు. కానీ, అతని మాటలను రావణుడు వినలేదు ఇక ఏమీ చేయలేక, మారీచుడు బంగారు రంగులో ఉండే లేడి రూపాన్ని పొంది, సీతారాములు నివసించే పర్ణశాల సమీపంలో సీతాదేవిని ఆకర్షించడంకోసం సంచరించడం ప్రారంభించాడు. ఇంతకు ముందు, సృష్టిలో ఏనాడూ బంగారు రంగులో ఉండే లేడి అనేది లేనందు వల్ల, ఆ బంగారు లేడి విలక్షణమైనది అయినది. అందువల్ల ఇక్కడ "ఓర్ మానై" అని ప్రయోగింపబడింది.

**"శెంగల్ పొడిక్కూఱై" (తిరుప్పావై –14)**

**"శిఱ్ఱెయిఱ్ఱు ముఱ్ఱల్ మూంగిల్ మూన్ఱు తండత్తనాయ్"**

(తిరుచ్చంద విరుత్తమ్– 52)

ఈ విధంగా మారీచుని మాయలేడి రూపంలో వచ్చేటట్లు చేసిన రావణుడు తాను కపట సన్యాసి వేషాన్ని ధరించి వచ్చాడు. చిన్న చిన్న కణుపులను కలిగిన, ముదిరిన, 3 వెదురు కర్రలను దండంగా కలిగినవాడై, రావణుడు వచ్చాడు. దీనివల్ల రావణుడు త్రిదండి సన్యాసి వేషాన్ని ధరించి వచ్చినట్లు తెలుస్తున్నది. కనుక, త్రిదండి సన్యాసివేషమే వైదిక సమ్మతమని సూచించినట్లు అయినది.

**"వంజిత్తు" (పెరియ తిరుమడల్ – 112)**

ఇటువంటి త్రిదండి సన్యాసివేషాన్ని ధరించి వచ్చిన రావణుడు సీతాదేవిని వంచిచాడు.

**"ఇలై క్కురంబిల్ తనియిరుప్పిల్"** **(పెరియ తిరుమడల్ –13)**

పర్ణాలతో లక్ష్మణుడు నిర్ణయించిన గృహంలో, ఒంటరిగా ఉండే,

**"కనివాయ్ తిరువినై ప్పిరిత్తు" (పెరియతిరుమొழி–5–7–7)**

పండిన దొండ పండువంటి అధరాన్ని కలిగిన, లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవిని శ్రీరామునినుండి విడదీసి.

"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా" (?సూర్యునికంటే వెలుతురు ఏ విధంగా వేరు కాదో, ఆ విధంగానే, నేను కూడా రాముని కంటే వేరు కాదు) "అనన్యా తు మయా సీతా భాస్కరేణ ప్రభా యథా" (? సూర్యుని కంటే ఏ విధంగా వెలుతురు ఏ విధంగా వేరు కాదో, ఆ విధంగానే, సీతాదేవి నాకంటే వేరు కాదు) అనే విధంగా ఒకే తత్వం అనేటట్టుగా ఉండే సీతారాములను ఇద్దరినీ విడదీసి, వేరువేరు చోట్ల ఉండేటట్లుగా చేశాడు, రావణుడు. ఆ విధంగా సూర్యుడు, ఆ సూర్యుని వెలుతురువలె ఉండే శ్రీరాముని, సీతాదేవిని విడదీశాడు.

**"నీళ్ కడల్ శూழ் ఇలంగైయిల్"**

(తిరువాయ్ మొழி–1–6–7) (పెరియ తిరుమొழி –6–3–5)

సీతాదేవిని తీసికొని పోయి, విశాలమైన సముద్రాన్ని చుట్టూ కలిగిన లంకలో.

విస్తృతమైన సముద్రాన్ని అగడ్తగా కలిగిన, అంతకుమించిన పటిష్ఠమైన కోటలను కలిగిన లంకానగరంలో ఉండే అశోకవనంలో సీతాదేవి బంధించి ఉంచాడు.

**"అరక్కర్ కుడిక్కు నంజాగ"**

(పెరియ తిరుమొழி– 10– 2– 4)

ఆ సీతాదేవి ఎటువంటిది? అంటే, రాక్షసకులప్రాణాన్ని హరించే విషంవంటిది.

భాగవతాపచారాన్ని చేస్తే దానివల్ల ఆపచారాన్ని చేసిన వాడే కాకుండా అతనికి చెందిన తరతరాలవారు కూడా నశించిపోతారు. రావణుని విషయంలో అదే జరిగింది. పరమ భక్తురాలైన సీతాదేవిన విషయంలో అపచారపడినందున, రావణుడే కాక, అతనికి సంబంధించిన బంధువులు, మిత్రులు, పరిజనులు అందరూ నశించిపోయారు.

**"కొడుపోయ్"** **(పెరియ తిరుమొழி** – 10 –2 –3)

ఆ విధంగా రాక్షసకులానికి విషంవంటి సీతాదేవిని తీసికొని పోయి,

**"వంబులామ్ కడి కావిల్ శిఱైయా వైక్క"**

(పెరియ తిరుమొழி– 10– 2 –5)

నిత్యనూతనంగా ఉండే సువాసనను కలిగిన వృక్షాలను కల అశోకవనంలో ఆమెను రావణుడు బంధించి ఉంచాడు.

శ్రీరాముడు సీతాదేవి ఏకాంతంగా, ఆనందంగా గడుపదగిన, అందమైన అశోకవనంలో సీతాదేవిని ఒంటరి చేసి, బంధించి ఉంచాడు.

ఇంతటితో సీతాపహరణవృత్తాంతం పూర్తి అయినది.

ఇక, ఆరవ భాగంలో జటాయుమోక్షం తెలుపబడుతున్నది.

**"అయోత్తియర్ కోన్"** (పెరియాழ்వార్ తిరుమొழி–3–10–4)

అయోధ్యానగరానికి ప్రభువైన శ్రీరాముడు

**"మాయ మాన్ మాయ చ్చెற்று"**

(తిరుక్కుఱుండాండగమ్– 16)

మాయ లేడిని నశించేటట్లుగా వధించి,

ఇంతకు ముందు రెండు సార్లు రాముడు మారీచుని వధించకుండా విడచి పెట్టాడు. కానీ, ఈసారి మాయామృగరూపంలో వచ్చిన ఇతనిని విడవకుండా, తన బాణానికి లక్ష్యం చేసి వధించాడు. ఈ ప్రయోగంలోని మొదటి "మాయ" శబ్దం సంస్కృతశబ్దం. దీనికి – ఆశ్చర్యకరమైన –అని అర్థం. రెండవ "మాయ" శబ్దం ద్రావిడ పదం. దీనికి – అంతరించి పోవడం – అని అర్థం.

**"అలైమలివేఱ్కణాళై అగన్ఱు"(పెరియతిరుమొழి–11–4–7)**

చూసినవారి మనస్సును చలింప చేసి, ఆకర్షించే అందాన్ని కలిగిన, వేలాయుధంవంటి నేత్రాలను కల సీతాదేవిని విశ్లేషించినందున,

**"తళర్వెయ్ దు చ్చడాయువై వైగుందత్తు ఏఱ్ఱి"**

(పెరుమాళ్ తిరుమొழி–10–6)

ఏనాడూ విశ్లేషించని, లక్ష్మీ స్వరూపిణి అయిన సీతాదేవిని విశ్లేషించినందువల్ల క్లేశాన్ని శ్రీరాముడు పొందాడు. "నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ", అనే విధంగా, ఏనాడూ విశ్లేషించకుండా నిత్యం సంశ్లేషించి ఉండే లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవి విశ్లేషం వల్ల చాలా క్లేశాన్ని పొందాడు.

శ్రీవిష్ణుపురాణంలో పరాశర మహర్షి లక్ష్మీనారాయణుల నిత్యసంశ్లేషాన్నిగూర్చి తెలియజేస్తూ, " అర్థో విష్ణు రియం వాణీ " అని వారి నిత్యసంబంధం శబ్దానికి, అర్థానికి మధ్య ఉండే అవినాభావసంబంధంవంటిది అని అన్నారు.

సీతను అన్వేషిస్తూ వనంలో సంచరించే రామలక్ష్మణులకు జటాయువు కనిపించాడు. ఈ జటాయువు పరమ భాగవతోత్తముడు. సీతాదేవిని రక్షించే ప్రయత్నంలో తన ప్రాణాలను కూడా త్యజించడానికి సిద్ధపడినవాడు. సీతను అపహరించుకొని వెళుతున్న రావణుని ఎదిరించి, అతని చేతిలో తీవ్రంగా గాయపడి, ప్రాణావశిష్టుడై పడి ఉన్నాడు. రాముని చూడగానే, తన స్వరూపానికి తగినట్లు ఆ స్వామికి "ఆయుష్మన్" అని మంగళాశాసనం చేశాడు. తాను అతనికి తెలియజేయబోయే, " రావణుడు సీతను అపహరించాడు" అనే వృత్తాంతాన్ని అతడు విన్నట్లయితే, అతనికి ఏమి ఆపద కలుగుతుందో! ఏమో! అని భయశంకతో మంగళాశాసనం చేశాడు. "సా దేవీ మమ చ ప్రాణాః రావణేనోభయం హృతమ్" – "ఆ సీతాదేవిని, నా ప్రాణాలను కూడా ఆ రావణుడే హరించాడు " అని చెప్పాడు. ఈ విధంగా భగవంతునకు మంగళాశాసనం చేయడం అనే గొప్పదైన భగవత్కైంకర్యం అనే లక్ష్మిని కలిగిన ఈ జటాయువు సంప్రదాయంలో, పెరియాళ్వారుల వలె, "పెరియ తిరువుడైయార్" అని పిలువబడుతున్నాడు. ఈ మహనీయుని వైభవానికి తగినట్లుగా శ్రీరాముడు, ఇతడు మరణించిన తరువాత ఇతనికి బ్రహ్మమేధ సంస్కారంతో సంస్కరించి, "మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకాననుత్తమాన్" అని పరమపదాన్ని చేరేటట్లు చేశాడు. ఏడవ భాగంలో కబంధవధ తెలుపబడింది.

**"కంగులుమ్ పగలుమ్ కణ్ తుయిలిన్ఱి"**

(తిరువాయ్ మొழி– 7 –2 –1)

రాత్రి, పగలు నిద్ర లేకుండా ఉండి,

సీతాదేవిని విశ్లేషించిన అందువల్ల కలిగిన నిరవధికమైన వ్యసనం వల్ల శ్రీరాముడు రాత్రి, పగలు నిద్ర లేకుండా తపించాడు. దివారాత్ర విభాగం అనేది లేకుండా సర్వకాలం సీత కోసం పరితపించాడు. " అనిద్రః సతతం రామః సుప్తో ఽ పి చ నరోత్తమః, సీతేతి మధురాం వాణి వ్యాహరన్ ప్రతిబుద్ధ్యతే" అని ఈ విషయాన్ని వాల్మీకి మహర్షి కూడా తెలియజేశాడు. (ఈ మాట, హనుమంతుడు లంకలో సీతతో పలికినది)

**"కానగమ్ పడి ఉలావి ఉలావి"**

(పెరియాழ్వార్ తిరుమొழி– 3–6–4)

అరణ్యప్రాంతంలో సీతాదేవిని అన్వేషిస్తూ తిరిగి, తిరిగి,

**"కణై ఒన్డినాల్ కవందనై మడిత్తు"**

(పెరియ తిరుమొழி –2 –10– 5)

అద్వితీయమైన బాణంతో కబంధుని వధించి,

ధనువు అనే గంధర్వుడు శాపవశంచేత వికృతమైన రూపాన్ని పొంది, కబంధుడు అయ్యాడు. ఇంద్రుడు వజ్రాయుదంతో ఇతనిని తలపై కొట్టినందువల్ల, ఇతని తల శరీరం లోపలకు వెళ్లి పోయింది. ఇతని శరీరంలో మొండెం మాత్రం బయటకు కనిపిస్తుంది. అందువల్ల అతనికి కబంధుడు అనే పేరు వచ్చింది. ఇతడు, తన పొడుగయిన చేతులను చాచి, ఆ చేతులకు అందిన ప్రాణులను ఆహారంగా స్వీకరించేవాడు. సీతాదేవిని అరణ్యంలో వెదకుతూ సంచరించే రామ లక్ష్మణులు ఇద్దరు ఇతని చేతిలో చిక్కారు. అప్పుడు రాముడు తన అమోఘమైన బాణాన్ని ప్రయోగించి, కబంధుని వధించాడు. అతనికి శాపవిమోచనాన్ని కలిగించి, నిజరూపాన్ని పొందేటట్లు

చేశాడు. ఇతడే, సీతను వెతకడానికి తగిన మార్గాన్ని రామునకు నిర్దేశించి, ఋశ్యమూక పర్వతానికి వెళ్ళమని చెప్పాడు.

ఇక, చివరి భాగంలో శబరీమోక్షం తెలుపబడింది.

## **"శవరి తంద కని ఉవందు"** (? )

శబరి ఇచ్చిన ఫలాలను సంతోషంతో భుజించి.

శ్రీవేదాంతదేశికులు రఘువీర గద్యలో (40) "అవంధ్యమహిమ మునిజనజనముషితహృదయ కలుష శబరి మోక్ష సాక్షిభూత" (విఫలం కాని గొప్పతనాన్ని కలిగినవారైన మతంగ మహర్షి మొదలైన మునులకు చేసిన పరిచర్య వల్ల లేకుండా చేయబడిన మనఃకాలుష్యాన్ని కలిగిన శబరి పొందిన మోక్షానికి సాక్షిగా నిలచినవాడా!) అని అన్నారు. అందువల్ల, ఆచార్య సంబంధ ప్రభావంవల్ల శబరి మోక్షాన్ని పొందింది. ఆమె మోక్షాన్ని పొందడానికి శ్రీరాముడు సాక్షిగా మాత్రమే నిలచాడు తప్ప, అతడు సాక్షాత్తుగా శబరికి మోక్షాన్ని ఇవ్వలేదు. ఆమె చేసిన ఆచార్యకైంకర్యమే, దానివల్ల ఆమె పొందిన ఆచార్యాభిమానమే ఆమె మోక్షానికి కారణం అయ్యాయి.

తన ఆచార్యులైన మతంగముని ఆజ్ఞానుసారంగా, ఆచార్య కైంకర్య రూపంగా శబరి శ్రీరామునకు ఫలాలను సమర్పించింది. దానితో పరమప్రీతుడైన శ్రీరాముడు ఆమె ఇచ్చిన ఫలాలను ప్రీతితో స్వీకరించాడు. అందువల్లనే వాల్మీకి మహర్షి కూడా, రామాయణంలో, " శబర్యా పూజితః సమ్యక్" అని అన్నాడు.

శబరి ఫలాలను సమర్పించిన వృత్తాంతం ఆళ్వారుల దివ్యప్రబంధాలలో ఎక్కడా ప్రస్తావించబడలేదు. ఈ వాక్యాన్ని శ్రీకృష్ణసూరి స్వయంగా సంకలనం చేశారు.

★★★★★

# కిష్కింధాకాండమ్

ఈ కాండలోని ప్రయోగాలను ఐదు భాగాలుగా విభజించవచ్చు.

వీటిలో, మొదటి విభాగంలో శ్రీరాముడు సుగ్రీవునితో స్నేహం చేసికోవడం తెలుపబడినది.

**"వన మరువు కవియరశన్ తన్నోడు కాదల్ కొండు"**

(పెరుమాళ్ తిరుమొழி–10–6)

**వనంలో నిత్యవాసం చేసే వానర ప్రభువైన సుగ్రీవునితో స్నేహం చేసుకొని.**

సంస్కృతంలోని కపిశబ్దమే ద్రావిడంలో కవి అని మారింది. కపి అంటే, వానరం అని అర్థం. అందువల్ల, " కవి అరశన్" అంటే, వానర ప్రభువు అని అర్థం. శ్రీరాముడు సుగ్రీవునితో చేసుకొన్నది కేవలస్నేహం మాత్రమే కాదు, ప్రీతిపూర్వకమైన స్నేహం.

సుగ్రీవుడు తన సోదరుడైన వాలివల్ల కలిగిన భయంచేత కిష్కింధానగరంలో నివసించకుండా, అరణ్యంలో మతంగముని ఆశ్రమానికి సమీపంలో ఋశ్యమూక పర్వతంపై నివసిస్తున్నాడు. ఈ విషయం "వన మరువు" అనే ప్రయోగంద్వారా ధ్వనిస్తున్నది.

సర్వేశ్వరుడైన శ్రీ రాముడు స్వయంగా "సుగ్రీవం శరణం గతః" అని, "సుగ్రీవం నాథ మిచ్ఛతి" అని సుగ్రీవుని ఆశ్రయించాలని, సీతను అన్వేషించడంలో సుగ్రీవుని సహాయం తీసుకోవాలని కోరి, అతనితో

అగ్నిసాక్షికంగా స్నేహం చేసుకున్నాడు. " ఏకం దుఖం సుఖం చ నౌ " అని ఒకరి సుఖదుఃఖాలను ఇంకొకరి సుఖదుఃఖాలుగా భావించే అవధికి స్నేహాన్ని చేసుకున్నాడు. దీనివల్ల శ్రీరాముని సౌశీల్యగుణంలోని పరమావధి సూచింపబడింది.

"కవి యరశన్ తన్ కాదల్ కొండు" అని అన్నందు వల్ల, శ్రీరాముడు సుగ్రీవునితో నేరుగా మైత్రిని చేసుకోకుండా, అతనికి అనుచరుడైన హనుమంతుని ద్వారా స్నేహాన్ని చేసుకున్నాడని సూచింపబడింది.

రెండవ భాగంలో సుగ్రీవునకు నమ్మకం కలిగించడంకోసం శ్రీరాముడు ఏడు సాలవృక్షాలను పడగొట్టడం తెలుపబడింది.

**"మరా మరమ్ ఏழ் ఎయ్ దు"**

(పెరియతిరుమొழி–5–5 –2)

**ఏడు సాల వృక్షాలను పడగొట్టి.**

శ్రీరాముడు సుగ్రీవునితో అగ్నిసాక్షికంగా స్నేహాన్ని చేసుకొన్న తరువాత సీతను రావణుడు అపహరించిన విషయాన్ని అతనికి తెలియజేసి, సీతను అన్వేషించడంలో సుగ్రీవుని సహాయాన్ని అర్థించాడు. సుగ్రీవుడు కూడా తనకు వాలి వల్ల జరిగిన అవమానాన్ని,బాధను శ్రీరామునకు తెలియజేసి, వాలి బారినుండి తనను రక్షించమని శ్రీరాముని శరణు వేడాడు. అప్పుడు తాను వానర సైన్యాన్ని నాలుగు దిక్కులకు పంపించి, సీత జాడను తెలుసుకోవడానికి వీలవుతుందని అన్నాడు. శ్రీరాముడు సుగ్రీవుని మాటను

అంగీకరించి, వాలిని సంహరించి, సుగ్రీవునకు రక్షణ కలిగిస్తానని మాట ఇచ్చాడు.

మహాబలశాలి అయిన వాలిని శ్రీరాముడు వధించగలడా? లేదా? అనే సందేహం సుగ్రీవుని మనసులో ఉన్నందున, ఆ సందేహాన్ని శ్రీరాముని ముందు వ్యక్తం చేశాడు. అతనికి నమ్మకం కలగాలంటే తాను ఏమి చేయాలని శ్రీరాముడు సుగ్రీవుని అడిగాడు. తన సందేహం శ్రీరాములు వాలిని సంహరించగలడు అనే నమ్మకం ఏర్పడాలంటే శ్రీరాముడు ఒక కార్యాన్ని చేయాలని అంటూ, ఏడు సాల వృక్షాలను చూపించి, వాటిని పూర్వం వాలి తన గొప్ప బలంతో అవలీలగా కదిలించి, వాటి ఆకులను రాలగొట్టగలిగేవాడని, శ్రీరాముడు బాణప్రయోగం చేసి, వాటిని పడగొట్టినట్లయితే, అతడు వాలిని సంహరించగలడని నమ్ముతానని అన్నాడు. సుగ్రీవుడు కోరినట్లుగానే శ్రీరాముడు ఒకే బాణాన్ని ప్రయోగించి, ఏడు సాలవృక్షాలను పడగొట్టాడు. అంతటితో ఉగ్రీవునకు రాము సామర్థ్యం పై నమ్మకం కలిగి, అతడు వాలిని సంహరించగలడనే నమ్మకం ఏర్పడింది.

భగవానుని సామర్థ్యం పై నమ్మకం లేనివారికి నమ్మకం కలిగించడం కోసం భగవానుడు అమోఘమైన శక్తిని కలిగిన తన ఆయుధాలను ప్రదర్శించి, వారికి నమ్మకాన్ని కలిగిస్తాడు అనే రహస్యం ఈ వృత్తాంతంద్వారా సూచింపబడింది.

మూడవ భాగంలో, వాలివధ తెలుపబడింది.

## "ఉరుత్తెழு వాలి మార్బిల్ ఒరు కణై ఉరువ ఓట్టి"

(పెరియ తిరుమొழி– 4 –6– 3)

**కోపంతో ముందుకు వచ్చిన వాలి వక్షస్సులో నాటుకునేటట్లు అద్వితీయమైన ఒక బాణాన్ని ప్రయోగించి.**

శ్రీరాముడు వాలిని వధించగలడు అనే నమ్మకం ఏర్పడిన తరువాత, సుగ్రీవుడు, శ్రీరాముని ప్రోత్సాహంతో వాలి పై యుద్ధానికి మొదటిసారి వెళ్ళాడు. శ్రీరాముడు, వాలికి సమీపంలోనే ఒక చెట్టు చాటున ఉండి, వాలిపై బాణాన్ని ప్రయోగించడానికి తగిన అవకాశం కోసం ఎదురుచూశాడు. ఆ ఇద్దరూ ఒకే పోలికను కలిగి ఉండడం వల్ల, వారిలో ఎవరు సుగ్రీవుడో, ఎవరు వాలో గుర్తించలేక, శ్రీరాముడు వాలి పై బాణాన్ని ప్రయోగించలేకపోయాడు. వాలి కొట్టిన దెబ్బలను తట్టుకోలేక సుగ్రీవుడు యుద్ధం నుండి పారిపోయి, పరిగెత్తుకొని వచ్చాడు. అప్పుడు శ్రీరాముడు సుగ్రీవుని గుర్తించడం కోసం తగిన గుర్తుగా అతని మెడలో లక్ష్మణుని ద్వారా గజ పుష్పమాలికను వేయించి, మళ్లీ సుగ్రీవుని వాలితో యుద్ధానికి పిలువమని అన్నాడు.

సుగ్రీవుడు కూడా, ఆ విధంగానే, మళ్లీ కిష్కిందా నగర ద్వారం దగ్గరకు వెళ్లి వాలిని యుద్ధానికి ఆహ్వానించాడు. ఆనందంగా కాలం గడుపుతున్న వాలి,

కాలం కాని కాలంలో తనపై యుద్ధానికి వచ్చినందున, సుగ్రీవునిపై మిక్కిలి కోపాన్ని పొందాడు. "ఇంతకు ముందే వాలికి భయపడి పారిపోయిన

సుగ్రీవుడు మళ్ళీ ఇంత ధైర్యంగా యుద్ధానికి వచ్చాడు. దీనికి ఏదో ఒక కారణం ఉండి ఉంటుంది. తొందర పడవద్దు" అని తార చెప్పినప్పటికీ, వాలి వినకుండా, కోపంతో సుగ్రీవునితో యుద్ధానికి తలపడ్డాడు.

ఇంతకు ముందు ఎవరు బాణాన్ని ప్రయోగించినప్పటికీ, ఎంతటి గొప్ప బాణాన్ని ప్రయోగించినప్పటికీ భగ్నం కాని కఠినమైన వాలివక్షస్సు శ్రీరాముడు ప్రయోగించిన అమోఘమైన బాణం నాటుకోగానే భగ్నమైనది. శ్రీరాముని అంబుల పొదిలో ఉండే ఏదో ఒక బాణాన్ని ప్రయోగించగానే, అంతటి కఠినమైన వాలి వక్షస్సు కూడా భగ్నమైపోయింది. వాలి భూమి పై పడిపోయాడు.

నాలుగవ విభాగంలో సుగ్రీవ పట్టాభిషేకం

**"కరుత్తుడై తంబిక్కు ఇన్బక్కదిర్ ముడి అరశళిత్తు"**

(పెరియ తిరుమొழி– 4 –6– 3)

శ్రీరాముని అభిప్రాయాన్ని అనుసరించి వర్తించే మనస్సు కలిగిన సుగ్రీవునకు ఆనందాన్ని కలిగించే, ప్రకాశించే కిరీటాన్ని అలంకరింప జేసి, కిష్కింధారాజ్యానికి ప్రభువుగా పట్టాభిషేకాన్ని చేశాడు.

ఐదవ విభాగంలో సీతను అన్వేషించడం కోసం సుగ్రీవుడు తన సేనను నాలుగు దిక్కులకు పంపించడం తెలుపబడింది.

**"వానర క్కోనుడనిరుందు వైదేగితనై త్తేడ"**

(పెరియాழ்వార్ తిరుమొழி–3–10 –8)

కిష్కింధానగరానికి ప్రభువుగా సుగ్రీవుని చేసిన తరువాత,శ్రీరాముడు, వర్షాకాలం గడచే వరకు రాచసుఖాలను అనుభవించి,

వర్షాకాలం ముగిసిన తరువాత సీతను వెదకడం కోసం నాలుగు దిక్కులలో పంపించవలసినదని సుగ్రీవునకు చెప్పాడు. సుగ్రీవుడు కూడా ఆ విధంగానే వర్ష ఋతువులో సుఖాలను అనుభవిస్తూ ఆనందంగా కాలం గడిపాడు. శ్రీరాముడు మాల్యవంత పర్వతంలో సీతావిరహంతో కాలాన్ని గడిపాడు.

కానీ, వర్షాకాలం గడిచినప్పటికీ, అతడు తన కర్తవ్యా న్ని స్మరించలేదు సీతను వెతకడం కోసం సేనను పంపలేదు. అప్పుడు, శ్రీరాముడు సుగ్రీవునిపై కోపించి, లక్ష్మణుని సుగ్రీవుని దగ్గరకు పంపించి, చేసిన మేలును మరచి, తన కర్తవ్యాన్ని మరచిన సుగ్రీవుని తగిన విధంగా శిక్షిస్తానని సందేశం పంపించాడు. సుగ్రీవుడు తన తప్పిదాన్ని గుర్తించి, శ్రీరాముని క్షమించమని ప్రార్థించి, వానరసేనను నాలుగు దిక్కులలోకి సీతను వెదకడం కోసం పంపించాడు.

## "విడుత్త తిశై క్కరుమమ్ తిరుత్తు"(తిరుప్పల్లాండు –9)

సుగ్రీవుడు తన సేనను విభజించి నాలుగు దిక్కులలో సీతను వెతకడం కోసం పంపించినప్పటికీ ఆ సీతాన్వేషణ కార్యం హనుమంతుని వల్లనే సాధ్యం అవుతుందని భావించి, ఆ విషయాన్ని శ్రీరామునకు చెప్పాడు అప్పుడు శ్రీరాముడు హనుమంతునకు తన నామంతో అంకితమైన అంగుళీయకాన్ని గుర్తుగా ఇచ్చాడు.

శ్రీరాముడు వనవాసానికి అన్ని ఆభరణాలను విసర్జించి బయలుదేరాడు అని "కలన్ అణియాదే "అని చెప్పబడింది కదా. ఇప్పుడు శ్రీరాముని దగ్గర ఏ విధంగా అంగుళీయకం ఉన్నది? ఏ విధంగా అతడు దానిని హనుమంతునకు తన గుర్తుగా ఇచ్చాడు? అనే ప్రశ్నకు మన పూర్వాచార్యులు పలు విధాలుగా సమాధానాన్ని చెప్పారు. ఈ అంగుళీయకాన్ని జనక చక్రవర్తి సీతా కళ్యాణసందర్భంలో శ్రీరామునకు బహూకరించాడు. వివాహ

సమయంలో మామగారు జనకుడు ఇచ్చిన అంగుళీయకాన్ని తీసివేయడం తగినది కాదు కనుక, దానిని మాత్రం శ్రీరాముడు ధరించి ఉన్నాడు దానినే అతడు హనుమంతునకు ఇచ్చాడు – అనేది ఒక సమాధానం.

శ్రీరాముడు తనను వెళ్ళమని నియమించిన దక్షిణ దిక్కులో వెళ్లి, తనకు విధించిన కర్తవ్యం అయిన సీతాన్వేషణ కార్యాన్ని సవ్యంగా నిర్వహించి, పూర్తి చేశాడు, హనుమంతుడు. ఇకపై ఆ పని కోసం వేరు ఎవరిని పంపవలసిన అక్కర లేకుండా ఉండేటట్లుగా కార్యాన్ని పరిపూర్ణంగా నిర్వహించి పూర్తిచేసి– అని తాత్పర్యం. యజమాని తనకు విధించిన కార్యాన్ని అసంపూర్ణంగా నిర్వహించేవాడు, అధముడు విధించిన కార్యాన్ని మాత్రం పూర్తిగా నిర్వహించేవాడు, మధ్యముడు. విధించిన కార్యాన్ని పూర్తి చేయడమే కాకుండా, అది, మరింత పరిపూర్ణం కావడానికి ఆవశ్యకమైన ఇతర కార్యాలను కూడా నిర్వహించి పూర్తి చేసేవాడు, ఉత్తముడు. అటువంటి ఉత్తముడే హనుమంతుడు. సీత జాడను తెలుసుకొని రమ్మని పంపించిన శ్రీరాముడు, తాను సీతను చూసి తిరిగి వచ్చి ఆ విషయాన్ని శ్రీరామునకు చెప్పినప్పుడు, రావణుని బలం ఎంతటి అని అతడు అడిగితే, సమాధానం చెప్పలేని స్థితిలో ఉండడం కాకుండా, సీతను వెదకి, ఆమె వివరాలను తెలుసుకోవడంతో పాటు, శత్రువు అయిన రావణుని బలాబలాలను గూర్చి బలపరీక్ష చేసి, గ్రహించి తెలిసికొన్నవాడు, హనుమంతుడు

**“తిఱల్ విళంగు మారుదియుమ్”**

(పెరుమాళ్ తిరుమొழி –10– 11)

**పరాక్రమం ప్రకాశించే మారుతి కూడా.**

ఈ విధంగా స్వామి కార్యాన్ని సమర్థవంతంగా నిర్వహించిన హనుమంతుని పరాక్రమం గొప్పగా ప్రకాశించింది. ఇంతవరకు ప్రకాశించని హనుమంతుని పరాక్రమం ఇప్పుడు గొప్పగా ప్రకాశించింది.

**"మాయోన్ "(పెరియ తిరుమొழி– 7– 8– 1)**

**ఆశ్చర్యకరమైన శక్తిని కలవాడైన శ్రీరామచంద్రుడు పంపించిన**

భగవంతుని అవతార విశేషమైన శ్రీరాముడు సర్వజ్ఞుడు, సర్వశక్తి.అతడు సహజంగానే సీత జాడను తెలుసుకోగలిగిన జ్ఞానాన్ని, శక్తిని పూర్తిగా కలిగినవాడు అయినప్పటికీ, " ఆత్మానం మానుషం మన్యే" అనే విధంగా తనను ఒక మానవమాత్రునిగా భావిస్తున్నానని పల్కి, దానికి అనుగుణంగా వర్తించేవాడు కనుక, హనుమంతుని, సీత జాడను తెలుసుకోవడం కోసం పంపించాడు. అంతే తప్ప, అతడు తెలుసుకోలేనందువల్ల కాదు – అనే విశేషార్థం " మాయోన్ " అనే ప్రయోగం వల్ల స్ఫురిస్తుంది.

**"తూదురైత్తల్ శెప్ప " (తిరువాయ్ మొழி– 9 –7 –5)**

సందేశాన్ని సీతాదేవికి తెలియజేయడం కోసం. (హనుమంతుడు సముద్రాన్ని దాటడానికి ఆరంభించాడు)

★★★★★

# సుందరకాండమ్

ఈ కాండలోని 34 వాక్యాలను ఐదు విధాలుగా విభాగం చేయవచ్చు.

వీటిలో, మొదటి భాగంలో, హనుమంతుడు లంకలోకి ప్రవేశించి, సీతను చూడడం తెలుపబడుతున్నది.

**"శీరారుమ్ తిఱల్ అనుమన్"**

(పెరియాழ్వార్ తిరుమొழி– 3 –10–10)

**జ్ఞానం మొదలైన సద్గుణాలను నిండుగా కలిగినవాడు, శక్తిని కలిగినవాడైన హనుమంతుడు.**

వానరవీరులు ఎంతమందో ఉండగా, "ఇతడు మాత్రమే ఈ కార్యాన్ని సాధించగలడు" అని శ్రీరాముడు అభిప్రాయపడి, సీతకు సంబంధించిన గుర్తులను తెలియజేసి, తన అంగుళీయకాన్ని కూడా అతనికి గుర్తుగా ఇచ్చి పంపించిన జ్ఞానం మొదలైన గుణాలను, భావించినదానిని నిర్వహించి, పూర్తి చేయగలిగిన శక్తిని పూర్ణంగా కలిగిన హనుమంతుడు. "అసాధ్యసాధక స్వామిన్! అసాధ్యం తవ కిం వద, రామదూత! కృపాసింధో! మత్కార్యం సాధయ ప్రభో!" అని కదా, హనుమంతుడు ప్రార్థించబడుతున్నాడు.

**"మాక్కడలై క్కడందేఱి "(పెరియ తిరుమొழி– 10–2 –6)**

గొప్పదైన, నూరు యోజనాలను కలిగిన దక్షిణ సముద్రాన్ని "శతయోజన విస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్" అనే విధంగా అవలీలగా దాటి, ఆవలి తీరాన్ని చేరాడు. " కడందు" అని ఇక్కడ ప్రయోగించడం వల్ల, శ్రమ

లేకుండా అవలీలగా సముద్రం దాటడం తెలుపబడింది. హనుమంతుని స్తుతించే ఒక శ్లోకంలో "గోష్పదీకృతవారాశిమ్" (గోష్పాదం అంతా చిన్నదిగా చాలా నిడువైన సముద్రాన్ని దాటినవాడు) అని కీర్తింపబడుతున్నది కదా.

## "ముమ్మదిళ్" (తిరువెழு కూற்றிరుక్కై)

గిరిదుర్గం, జలదుర్గం, వనదుర్గం అనే మూడు విధాలైన దుర్గాలను కలిగినది అయిన

**"నీళ్ ఇలంగై పుక్కు"**

(పెరియాழ்వార్ తిరుమొழி– 3 –9 –10)

**విశాలమైన లంకానగరంలోకి ప్రవేశించి.**

లంకా నగరంలోకి ప్రవేశించాలంటే, ముందుగా విశాలమైన సముద్రాన్ని దాటాలి. అంతటితోవ చాలదు ఎత్తుగా ఉండే పర్వతాలను దాటి వెళ్లాలి. ఆ తరువాత దట్టమైన అరణ్యాలను దాటి వెళ్లాలి. అప్పుడే లంకలోకి ప్రవేశించడానికి వీలవుతుంది. ఈ విధంగా లంకా నగరం చుట్టూ మూడు విధాలయిన దుర్గాలు సహజంగానే ఏర్పడి ఉన్నాయి. కందిరీగల పుట్టలో కందిరీగలు చేరి నివసించేటట్లుగా, లంకానగరంలో, కందిరీగలవంటి, హింసా ప్రకృతిని కలిగిన రాక్షసులు, అసురులు నివసించే నగరం, లంకానగరం. కందిరీగల పుట్టవైపు ఎవరూ వెళ్లడానికి ధైర్యం చేయలేక, భయపడేటట్లుగా, లంగా నగరంలోకి ప్రవేశించడానికి దేవతలలో కూడా, ఎవరికి ధైర్యం చాలక, జంకే నగరం, లంకా నగరం. పొరపాటున ఎవరైనా, కందిరీగపుట్టలో ఒక్క

ఈగను కదిలించినప్పటికీ, ఆ పుట్టలో ఉండే అన్ని ఈగలు దాడి చేసేటట్లుగా, లంకానగరంలో ఉండే ఎవరిని ఎదిరించినా, ఆ నగరంలో ఉండే రాక్షసులందరూ ఎదిరించి ముట్టడిస్తారు. " లంకాం రావణపాలితామ్" అని, ఇటువంటి లంకానగరం, అంతు లేని బలాన్ని, పరాక్రమాన్ని కలిగిన రావణుని చేత పాలింపబడటంవల్ల కూడా, ఎవరు ప్రవేశించడానికి సాధ్యం కానిది. ఇటువంటి దుష్ప్రవేశమైన లంకానగరాన్ని జ్ఞానాది గుణాలను, పరాక్రమాన్ని కల హనుమంతుడు అవలీలగా ప్రవేశించాడు.

## "కడి కావిల్" (పెరియ తిరుమొழி –10 –2 –5)

## చక్కని పరిమళాన్ని వీచే తోటలను కలిగిన అశోకవనంలో.

హనుమంతుడు లంకలో యాగశాలనుండి పానశాల వరకు, ఏ చోటును వదలకుండా, అన్ని చోట్ల సీతాదేవి కోసం వెదికాడు. కానీ, ఎక్కడా ఆమెను చూడలేక, చివరకు అశోకవనంలోకి ప్రవేశించాడు. తన ప్రయత్నంతో సీతాదేవిని దర్శించడం సాధ్యం కాదని గుర్తించి, హనుమంతుడు, నమోస్తు రామాయ సలక్ష్మణాయ నమోస్తు దేవ్యై జనకాత్మజాయై" అని సదాచార్య పురస్సరంగా సీతారాములను ఇద్దరినీ శరణు వేడి, వెదకడానికి మళ్లీ ఆరంభించాడు. అప్పుడు, అక్కడ, అశోకవనంలో, తాను కూర్చున్న శింశుపా వృక్షం క్రింద క్రిందనే ఆమెను చూశాడు.

దీనివల్ల, దివ్య దంపతుల దర్శనం అనేది, మన ప్రయత్నం వల్ల సాధ్యం కాదని, వారి అనుగ్రహం వల్లనే అది లభిస్తుందని సూచింపబడింది. ఇక్కడ

లక్ష్మణ నామాన్ని, సీతానామాన్ని కూడా అనుసంధించడం వల్ల, భగవత్సమాశ్రయణాన్ని సదాచార్య సమాశ్రయణ పూర్వకంగా, లక్ష్మీపురుషకార పురస్సరంగా చేయాలని కూడా సూచింపబడింది.

ఆ అశోకవనం ఎంత మనోహరంగా ఉన్నదో, ఈ ప్రయోగం తెలుపుతున్నది. శ్రీరామాయణంలో, అశోకవన వర్ణనను వాల్మీకి మహర్షి ప్రత్యేకంగా ఒక సర్గలో చేశాడు.

**"వారారు ములై మడవాళ్ వైదేగితనై క్కండు "**

(పెరియాళ్వార్ తిరుమొళి–3–10– 10)

**కంచుకంతో ఆచ్ఛాదింపబడిన వక్షస్సును కలిగిన, అందమైన సీతాదేవిని దర్శించి.**

విదేహుడనే ప్రభువు వంశంలో జన్మించిన జనకునకుకూడా విదేహుడని పేరు. విదేహుడనే పేరు కలిగిన జనకుని కుమార్తె కనుక, సీతకు వైదేహి అని పేరు. ఈ వైదేహి శబ్ద ప్రయోగం ద్వారా, సీతాదేవి, శ్రీరామునకు దూరమై తపించే ఆ సమయంలో, తన దేహరక్షణ పోషణ విషయంలో ఏ విధమైన శ్రద్ధాసక్తులు లేనిది అని, అందువల్ల ఆమె శరీరం కృశించి, కాంతి తగ్గి ఉన్నదని సూచింపబడింది.

ఇక్కడనుండి రెండవ భాగం ప్రారంభం అవుతున్నది. ఇందులో, శ్రీరామునకు సంబంధించిన వివరాలను హనుమంతుడు సీతకు తెలియజేయడం వర్ణింపబడింది.

లంకలో అశోకవనంలో బంధింపబడిన సీతాదేవి, రామ విరహాన్ని, రాక్షస స్త్రీలు పెట్టే బాధలను, రావణుడు పలికిన తగని మాటలను సహించలేక, తన ప్రాణాలను తీసుకోవడానికి కూడా సిద్ధపడింది. తన కేశాలతో కంఠానికి బిగించుకొని, వృక్షానికి ఉరివేసుకొనే ప్రయత్నం చేసింది. అప్పుడు హనుమంతుడు ఆమె ప్రాణాలను కాపాడడం కోసం, చెట్టుపై నుండి మృతసంజీవనం అయిన రామకథను మధురంగా గానం చేశాడు. అతని గానాన్ని విన్న సీతాదేవి ఓదార్పును పొంది, తన ఆత్మహత్యా ప్రయత్నం విరమించింది. భగవద్విశ్లేషం సహించలేని స్థితి ఏర్పడినప్పుడు, భక్తులకు, తమ ప్రాణాలపై, దేహంపై ఆశ నశించి, " ఉయరినాల్ కుఱైవిల్లా, ఉడంబినాల్ కుఱైవిల్లా" అని "భగవంతునకు ఉపయోగపడని ఆత్మ – ఆత్మీయాలు అక్కరలేదు, వాటిని విడచి పెట్టాలి " అనే స్థితి కలుగుతుంది – అనే విషయం ఇక్కడ సూచింపబడింది.(ఇటువంటి స్థితినే మనం నమ్మాళ్వారుల విషయంలో గమనించవచ్చు.) ఆ వృత్తాంతం ఇక్కడ ప్రస్తావించబడుతున్నది.

హనుమంతుడు సీతాదేవి శ్రీరామునకు సంబంధించిన ఆరు విధాలయిన వివరాలను తెలిపాడు. ముందుగా దానికి అవతారిక ప్రస్తావించబడుతున్నది.

**"నిన్నడియేన్ విణ్ణప్పమ్ కేట్టరుళాయ్! "(తిరువిరుత్తమ్ –1)**

**సీతాదేవీ! నీకు దాసుడనైన నేను చేసే ఈ విజ్ఞాపనను ఆలకించు.**

"దాసో ఽ హం కోసలేంద్రస్య" అని, శ్రీరామునకు దాసుడనని ఇంతకు ముందు పలికిన హనుమంతుడే, ఇక్కడ సీతాదేవి ముందు "నిన్నడియేన్" – "నీకు దాసుడను" అని అన్నందు వల్ల, ఒక సాంప్రదాయికమైన గొప్ప అర్థం సూచింపబడింది. "శ్రీరామునకు దాసుడను" అని హనుమంతుడు చెప్పినప్పుడే, అతడు సీతాదేవికి కూడా దాసుడు అయ్యాడు. జీవుని దాసత్వం అంటే,, కేవలనారాయణునకు మాత్రమే దాసుడై ఉండడం అని అర్థం కాదు, దివ్యదంపతులకు ఇద్దరికి దాసుడై ఉండడమనే అర్థం. ఈ విషయాన్నే ద్వయమంత్రంలోని ఉత్తరఖండం " శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే " అని తెలుపుతున్నది. "తిరువిల్లా త్తేవరై త్తేఱేల్ మిన్ తేవు " లక్ష్మీ సంబంధం లేని దైవాన్ని పరదైవంగా కొలువకండి) అని అన్నారు, ఆళ్వారులు కూడా.

కానీ, ఇక్కడ, హనుమానుడు "మీ ఇద్దరికీ దాసుడను " అని అనకుండా, నీకే దాసుడను" అని సీతతో అనడం ఏ విధంగా పొసగుతుంది? అనే సందేహం కలుగుతుంది. ఈ విధంగా హనుమానుడు అనడంలో ఒక రసోక్తి ఇమిడి ఉన్నది అని పెద్దలు అంటారు. మొదటగా సీతను వెతకడం కోసం బయలుదేరిన హనుమానుడు, " ఒక స్త్రీ కోసంగా రాముడు ఇంతగా పరితపిస్తున్నాడే!" అని భావించాడు. కానీ అశోకవనంలో సీతాదేవిని దర్శించిన తరువాత, సీతవైలక్షణ్యాన్ని దర్శించి, " దుష్కృతం కృతవాన్ రామో హీనో యదనయా ప్రభుః" (ప్రభువైన శ్రీరామచంద్రుడు ఈ సీతాదేవికి

దూరమై, కాలాన్ని గడపడం అనే చాలా దుష్కరమైన కార్యాన్ని చేస్తున్నాడు) అని తన మనసులో భావించాడు. అటువంటి సీతాదేవి కోసం రాముడు ఎంత బాధపడినా తక్కువే – అని అనుకున్నాడు. " ఇకపై నేను రామునకు కాదు ఇంతటి గొప్పతనాన్ని కలిగిన సీతాదేవి దాసుడను –అని భావించి, ఈ విధంగా "నిన్నడియన్" (నీకు నేను దాసుడను) అని అన్నాడు– అనే ఒక రసోక్తి ఇందులో ఇమిడి ఉన్నది – అని పెద్దల వివరణం. శ్రీరాముడు సీతాదేవి సమానమైన అతిశయాన్ని కలిగినవారు అయినప్పటికీ, సీతాదేవికి కల వైలక్షణ్యాన్ని వాల్మీకి మహర్షి శ్రీరామాయణంలో " తుల్యశీల వయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్, రాఘవోర్హతి వైదేహీం తం చేయమసితేక్షణా" (శ్రీరాముడు సీతాదేవి అనే ఇద్దరు సమానమైన శీలాన్ని, వయస్సును, ప్రవర్తనను, కలిగినవారు, సమానమైన ఆభిజాత్యలక్షణాలను కలిగినవారు. కనుక, ఒకరికి ఒకరు తగినవారు. అయినప్పటికీ, నల్లని కన్నులను కలిగిన సీతాదేవి నేత్రసౌందర్యంలో శ్రీరాముని మించినది) అని తెలియజేశాడు.

### (అయోత్తి తన్నిల్) ఓర్ ఇడవగైయిల్ ఎల్లియమ్ పోదినిరుత్తల్

అయోధ్యానగరంలో ఒకచోట, రాత్రి సమయంలో శ్రీరాముడు ఏకాంతసన్నివేశంలో ఉండేటప్పుడు,

సీతా రాముల కళ్యాణం జరిగిన తరువాత వారిద్దరూ అయోధ్యా నగరానికి చేరి, కొంతకాలం సుఖంగా కాలాన్ని గడిపారు. ఆ సమయములో

జరిగిన సందర్భం, ఇది. ఒకనాటి రాత్రి ఆ దివ్య దంపతులిద్దరూ మనోహరమైన రాత్రివేళ, ఏకాంతంగా ఉండే చోట, ఆనందించేటప్పుడు,

**"మల్లిగై మామాలై కొండు అంగార్ త్తదువుమ్"**

(పెరియాళ్వార్ తిరుమొళి −3 −10 −2)

నీవు, శ్రీరాముని అందమైన మల్లెపూల మాలతో బంధించిన వృత్తాంతం.

ఇది ఒక రహస్య వృత్తాంతం. సీతారాములకు ఇద్దరికి మాత్రమే తెలిసిన వృత్తాంతం. రాముడు హనుమంతునకు గుర్తుగా చెప్పిన విషయాలలో ఒకటి. గోదాదేవి తాను ధరించి విడిచిన పూమాలికతో, తాను రచించిన వాగ్మాలికతోను శ్రీకృష్ణుని బంధించినట్లుగా, సీతాదేవి కూడా శ్రీరాముని ఏకాంత సమయంలో అందమైన మల్లెపూల మాలతో బంధించింది. ఇది రాముని ప్రణయిత్వ పారతంత్ర్యప్రయుక్తమైన లీల. భగవంతుడు జీవుల కర్మ బంధాలను తీర్చే శక్తిని కలిగినవాడు. అటువంటి స్వామి భక్తుల ప్రేమ బంధానికి కట్టుబడతాడు − అనే తత్వానికి ఇది ఒక ఉదాహరణం.

ఈ వృత్తాంతం వాల్మీకి రామాయణంలో కానీ, కంబ రామాయణంలో కాని గోచిరించదు. ఆళ్వారుల ప్రబంధాలలో మాత్రమే కనిపిస్తున్నది. ఇది ఏ విధంగా సంభవం? ఇటువంటి వృత్తాంతాలను ఏ విధంగా ప్రమాణంగా గ్రహించడం? − అనే సందేహం కలుగవచ్చుం.

స్వప్రయత్నంతో జ్ఞానాన్ని అర్జించిన మహర్షులకు సైతంఅనుగ్రహించని కొన్ని అపూర్వమైన లీలలను భగవానుడు తన నిర్హేతుక కృపతో " మయర్వఱ మదినలమ్" (ఏ విధమైన భ్రమ, ప్రమాదం,సందేహం లేని, భక్తి రూపంగా పరిణమించిన జ్ఞానాన్ని) ఆళ్వారులకు అనుగ్రహించినట్లే, తన అపూర్వమైన దివ్యలీలలను కూడా వారికి సాక్షాత్కరింపజేశాడు.. అందువల్ల వారు ఆ వృత్తాంతాలను తమ దివ్య ప్రబంధాలలో గానం చేశారు – అని మన పూర్వాచార్యులు ఇక్కడ సమన్వయం చేశారు.. ఇంతేకాకుండా, కల్పభేదాన్నిబట్టి, రామచరిత్రలోని కొన్ని కొన్ని వృత్తాంతాలలో వైలక్షణ్యాలు గోచరించే అవకాశం ఉన్నదని, పలు పురాణాలలో వర్ణింపబడిన ఒకే కథలో కనిపించే తేడాలను ఈ విధంగానే సమన్వయం చేసికోవాలనికూడా వారు అభిప్రాయపడ్డారు.

ఇప్పుడు, రెండవ గుర్తును హనుమంతుడు సీతకు తెలియజేస్తున్నాడు.

**"కలక్కియమా మనత్తళాయ్ కైకేయి వరమ్ వేండ"**

**కలుషితమైన మనస్సు కలిగినదై కైకేయి వరాలను అడుగగా.**

కైకేయి సహజంగా శ్రీరామునిపై ద్వేష భావాన్ని కలిగినది కాదు. రాముని చిన్నప్పటినుండి అతనిపై ఎంతో వాత్సల్యాన్ని కలిగి ఉండేది. తన కుమారుడైన భరతునిపై కంటే కూడా రాముని పైననే ఎక్కువ ప్రీతిని కలిగి ఉండేది. కౌసల్య రాముని పై ఎంతటి ప్రేమను కలిగి ఉండేదో, దానికి మించిన ప్రేమను కైకేయి రాముని పై కలిగి ఉండేది. అందువల్ల ఆమెను

"మామనత్తనళ్" అని ఆళ్వార్లు విశేషించి పలికారు. అంతటి వాత్సల్యాన్ని రామునిపై కలిగిన కైకేయికూడా, మంథర చేసిన దుర్భోధవల్ల తాత్కాలికంగా రామునిపై మనసులో ద్వేషభావాన్ని పొంది, అతని పట్టాభిషేకానికి భంగం కలిగించేటట్లు శ్రీరాముడు 14 సంవత్సరాలు వనవాసం చేయాలి అని, భరతునకు పట్టాభిషేకాన్ని చేయాలని, రెండు వరాలను దశరథుని కోరింది. మందర పర్వతం పాలసముద్రాన్ని క్షోభను పొందించినట్లుగా, ఈ మంథర కూడా స్వచ్ఛమైన కైకేయి మనస్సును క్షోభను పొందించింది – అని అన్నారు, తమ వ్యాఖ్యానంలో, మణవాళ మహాములు. దీనివల్ల కైకేయి సహజంగా ఎటువంటి స్వభావాన్ని కలిగినదో, సూచింపబడింది.

**మలక్కియ మా మనత్తననాయ్ మన్నవనుమ్ మఱాదొழியయ,**

కైకేయి అడిగిన తగని వరాలను విని దశరథుడు కలత చెందిన గొప్ప మనసును కలవాడై, ఆమె అడిగిన వరాలను కాదనలేకపోగా.

సత్యవచనపాలనం అనే ఆభాస ధర్మంపై శ్రద్ధను కలిగిన దశరథుడు కైకేయి అడిగిన వరాలను కాదనలేకపోయాడు. ధర్మ సంకటంలో చిక్కుకొని ఏమీ బదులు పలుక లేక, కైకేయి అడిగిన వరాలను కాదనలేకపోయాడు.

**"కులక్కుమరా! కాడుఌైయపో్! ఎన్టు విడై కొడుప్ప"**

"ఇక్ష్వాకు వంశాన్ని ప్రకాశింప చేయడం కోసం అవతరించిన కుమారా!" వనవాసానికి వెళ్ళు" అని తన అంగీకారాన్ని ఇవ్వగా. (శ్రీరాముడు తండ్రి మాటకు కట్టుబడి వనవాసానికి బయలుదేరాడు)

**"ఇలక్కుమణన్ తన్నోడు అంగెయ్ దుమ్"**

(పెరియాழ்వార్ తిరుమొழி– 3 –10– 3)

**లక్ష్మణునితో పాటు వనవాసానికి వెళ్లడం.**

శ్రీరాముడు వనవాసానికి బయలుదేరడానికి చూసిన లక్ష్మణుడు తాను అతనిని విడచి ఉండలేనని, తాను కూడా అతనితో వెంట వస్తానని నిర్బంధించి, శరణాగతి చేసి శ్రీరాముని ఒప్పించి, అతనితో పాటు వనానికి వెళ్ళాడు. ఈ విధంగా శ్రీరాముడు లక్ష్మణునితో పాటుగా వనవాసానికి బయలుదేరాడు.

ఇక్కడ సూక్తిలో, ఆళ్వార్లు, లక్ష్మణునితో పాటుగా శ్రీరాముడు వనవాసానికి వెల్లినట్లు కనిపిస్తున్నది. వాస్తవానికి శ్రీరాముని వెంట కదా లక్ష్మణుడు వెళ్ళాడు. మరి, శ్రీరాముడు లక్ష్మణుని వెంట వెళ్ళినట్లు ఆళ్వారులు పలకడంలో ఆంతర్యం ఏమి? అని అంటే, ఈ విధంగా ఆళ్వారులు పలకడం వాల్మీకి సూక్తిని అనుసరించడమే.".ప్రాగేవ తు మహాభాగః సౌమిత్రిః మిత్రనందనః, పూర్వజస్యానుయాత్రాయాం ద్రుమచీరై రలంకృతః" (తన అన్నగారైన శ్రీరాముడు వనవాసానికి సిద్ధం కావడానికి ముందుగానే, మిత్రులకు ఆనందం కలిగించే సుమిత్రానందనుడైన లక్ష్మణుడు నారబట్టలను కట్టుకొని వనవాసానికి సిద్ధం అయ్యాడు) అనే వాల్మీకి సూక్తిని అనుసరిస్తూ ఆళ్వారులు ఈ విధంగా అన్నారు. ఈ రహస్యాన్ని శ్రీవరవరమునులు తమ వ్యాఖ్యానంలో తెలియజేశారు. శ్రీరాముడు వనవాసానికి బయలుదేరడానికి

ముందుగానే లక్ష్మణుడు నార బట్టలను కట్టుకొని వనవాసానికి సిద్ధం అయ్యాడు. ఆ విధంగా "తనకంటే ముందు వనవాసానికి సిద్ధపడిన లక్ష్మణుని వెంట శ్రీరాముడు వెళ్ళాడు " అనే వాల్మీకి వచనాన్ని అనుసరించి అళ్వార్లు ఈ విధంగా అన్నారు. ఈ రహస్యం, రామలక్ష్మణులతో చాలా దగ్గర సంబంధాన్ని కలిగినవారికి కదా తెలుస్తుంది. హనుమంతుడు ఆ విధంగా రామలక్ష్మణులతో సన్నిహిత సంబంధాన్ని కలిగినవాడు కనుక, ఈ రహస్యాన్ని తెలిసినవాడు. దానిని సీతకు తెలియజేస్తున్నాడు. ఇది రెండవ రహస్యం.

ఇప్పుడు, హనుమంతుడు, మూడవ రహస్యవృత్తాంతాన్ని సీతకు తెలియజేస్తున్నాడు.

**"గంగై తన్నిల్ కూరణింద వేల్వలవన్ కుగనోడు శీరణింద తోழమై కొండదువుమ్" (పెరియాழ் వార్ తిరుమొழி– 3 –10 –4)**

గంగానదీతీరంలో, చాలా పదునైన అంచును కలిగిన వేలాయుధాన్ని కలిగినవాడు, దానితో యుద్ధం చేయడంలో సమర్థుడు అయిన గుహునితో గొప్ప స్నేహాన్ని పొందడం.

గుహుడు వ్యాధకులానికి చెందినవాడు. ఆ జాతికి అనుగుణమైన వేలాయుధాన్ని ధరించేవాడు. అతడు, ఆ ఆయుధాన్ని ధరించి, యుద్ధానికి వెడితే, శత్రువు ఎటువంటివాడైనా సరే, యుద్ధ రంగంలో మట్టి కరువ వలసినదే, అపజయాన్ని పొందవలసినదే. ఆ ఆయుధంతో అంతటి సామర్థ్యంతో యుద్ధం చేయగలిగినవాడు, అతడు. అటువంటి, చాలా నీచకులానికి చెందినవాడైన గుహునితో కూడా శ్రీరాముడు, "శీరణింద

తోழమై", "ఆత్మసమః సఖా" అనే విధంగా అంతరంగ స్నేహాన్ని పొందాడు, శ్రీరాముడు. ఈ స్నేహం ఎంత గొప్పది అంటే, భగవంతుని సౌశీల్య సౌలభ్య వాత్సల్యాది కల్యాణ గుణాలను అన్నిటిని వ్యక్తం చేసేటటువంటిది. అందువల్ల ఇది "శీరణింద తోழమై". దీనిని తిరుమంగై ఆళ్వారులు చాలా అందంగా "ఏழை ఏదలన్" అనే దశకంలోని "మాழై మాన్ మడనోక్కి" అనే సూక్తిలో అనుగ్రహించారు. తన భార్య అయిన సీతాదేవిని గుహునకు స్నేహితురాలిగాను, తన తమ్ముడైన లక్ష్మణుని గుహునకు తమ్మునిగాను శ్రీరాముడు పరిచయం చేశాడు, అంతటి గాఢమైన ప్రాణస్నేహాన్ని శ్రీరాముడు గుహునితో చేసికొన్నాడు – అని వారు అన్నారు. " ఉన్ తంబి ఎన్ తంబి " – "నీకు తమ్ముడైన లక్ష్మణుడు నాకు తమ్ముడు" అని అంటూ గుహుని సంబంధాన్ని పురస్కరించుకొని, శ్రీరాముడు లక్ష్మణునిగూర్చి పలికినట్లు ఆ పాశురంలో ఆళ్వారులు పలికారు. దీనివల్ల " భగవంతుడు భక్తసంబంధాన్ని పురస్కరించుకుని అనుగ్రహిస్తాడు" అనే ఒక సాంప్రదాయికమైన రహస్యం ఇక్కడ వ్యక్తం చేయబడిందని మన ఆచార్యులు అందంగా వ్యాఖ్యానించారు. ఇటువంటి లక్షణమైన స్నేహాన్ని రాముడు గుహునితో చేసికొన్నాడు.

ఇప్పుడు, హనుమంతుడు నాలుగవ రహస్యాన్ని తెలియజేస్తున్నాడు.

**"శిత్తిరకూడ తిరుప్ప"**

**(పెరియాழ్వార్ తిరుమొழி–3 –10 –6)**

చిత్రకూట పర్వతంలో ఉండగా,

## **“పరద నంబి పణిందదువుమ్”**

(పెరియాళ్వార్ తిరుమొళి–3–10– 5)

**గుణపూర్ణుడైన భరతుడు వచ్చి సేవించడం.**

శ్రీరాముడు చిత్రకూట పర్వతప్రాంతంలో నివసిస్తూ ఉండగా, భరతుడు వశిష్ఠుడు మొదలైనవారితో, తల్లులతో, పరిజనంతో కలసి బయలుదేరి శ్రీరాముని దగ్గరకు వచ్చి, అతనిని అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యపాలనను చేయమని ప్రార్థించాడు. కానీ, శ్రీరాముడు అందుకు అంగీకరించక, తనకు ప్రతినిధిగా తన పాదుకలను భరతునకు ఇచ్చి,ఆ పాదుకల పేరుతో రాజ్యపాలనను తాను తిరిగి వచ్చేవరకు చేయవలసినదిగా ఆజ్ఞాపించాడు. భరతుడు కూడా శ్రీరాముని ఆజ్ఞను అనుసరించి, శ్రీరాముని పాదుకలను స్వీకరించి అయోధ్యకు తిరిగి వెళ్లి, ఆ నగరానికి బయట నందిగ్రామంలో నివసిస్తూ, రాజసింహాసనంపై శ్రీరాముని పాదుకలను ఉంచి, వానిని ఆరాధిస్తూ, ఆ పాదుకల పేరుతో పాలనను చేశాడు.

ఈ వృత్తాంతం సర్వలోక ప్రసిద్ధం కదా! మరి, హనుమంతుడు దీనిని ఒక గుర్తుగా చెప్పడంలో ఆంతర్యం ఏమి? అని అంటే, ఇక్కడ హనుమంతుని వచనంలో నంబిపదం ప్రయోగింపబడింది. ఇక్కడ నంబి పదానికి – భగవత్ పారతంత్ర్యం అనే గుణంలో పరిపూర్ణుడు – అని అర్థం. ఈ రహస్యాన్ని తెలియడం రామభక్తుడైన హనుమంతునకు తప్ప వేరొకరికి సాధ్యం కాదు.

ఇప్పుడు, ఐదవ రహస్యాన్ని హనుమంతుడు తెలియజేస్తున్నాడు.

**"శిఱుకాక్కై ములై తీండ మూవులగుమ్ తిరిందోడి విత్తగనే! రామా ఓ! నిన్నబయమ్ ఎన్న అత్తిరమే అదన్ కణ్ణ అఱుత్తదువుమ్"**

(పెరియాళ్వార్ తిరుమొళి– 3 –10 –6)

పక్షులలో చాలా నీచమైనది అయిన కాకి రూపాన్ని ధరించిన అసురుడు సీతాదేవి వక్షస్సును గాయపరచగా, అతనిపై శ్రీరాముడు కోపించి, బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. దానికి భయపడి ఆ కాకాసురుడు ముల్లోకాలను తిరిగి, " ఆశ్చర్యకరమైన శక్తిని కల శ్రీరామా! నాకు అభయం ఇవ్వాలి" అని శరణాగతి చేయగా, ఆ విధంగానే దానిని రక్షించి, దాని ఒక కంటిని మాత్రం పోగొట్టడం.

ఈ వృత్తాంతం సీతారాములు ఇద్దరు చిత్రకూట పర్వతప్రాంతంలో నివసించే సమయంలో సంభవించింది. అయితే ఈ వృత్తాంతం సీతారాములకు ఇద్దరికీ మాత్రమే తెలుసు మరెవ్వరికీ తెలియదు. లక్ష్మణుడు కూడా ఆ సమయాల్లో దగ్గర లేడు. శ్రీరాముడు హనుమంతుని సీతను వెతకడం కోసం పంపించినప్పుడు, అతనికి చెప్పిన గుర్తులలో ఇది కూడా ఒకటి. లక్ష్మణునకు కూడా చెప్పని ఈ రహస్యాన్ని హనుమంతునకు శ్రీరాముడు చెప్పాడు అంటే, హనుమంతుని లక్ష్మణుని కంటే సన్నిహితునిగా శ్రీరాముడు భావించాడు – అని ఏర్పడుతున్నది. అందువల్ల ఇది రహస్యమే. దీనిని హనుమంతుడు ఒక గుర్తుగా సీతకు తెలియజేస్తున్నాడు.

సీతారాములు ఇద్దరూ మందాకినీ నదిలో జలక్రీడను ఆడి, విశ్రాంతి తీసికునే సమయంలో, కొంత సేపు సీతాదేవి రాముని ఒడిలో నిద్రించినది. ఆ తరువాత, శ్రీరాముడు సీతాదేవి ఒడిలో శయనించి నిద్రపోయాడు. అప్పుడు ఇంద్రుని కుమారుడైన జయంతుడు తమోగుణ ప్రాచుర్యాన్ని కలిగినవాడు అయినందున కర్తవ్యాకర్తవ్యవైచక్షణ్యాన్ని లేనివాడై, దేవ వేశాన్ని మరిచిపోయి క్షుద్రమైన కాకి రూపాన్ని ధరించి వచ్చి, జగజ్జనని అనే భావం ఏమాత్రం లేకుండా, ఆమె వక్షస్సును గాయపరచాడు. అందువల్ల అతనిని "శిఱుకాక్కై"అని ఆళ్వారులు అన్నారు. లోకానికి తల్లి అయిన సీతాదేవి విషయంలో ఈ విధంగా తగని కామాన్ని కలిగి ఉండడం ఎంతటి నీచమైనది. అందువల్ల, ఇతడు చాలా అల్పమైన, క్షుద్రమైన కాకి అని నిర్దేశింపబడ్డాడు.

సీతాదేవి నివారించాలని ఎంత ప్రయత్నం చేసినా, కాకాసురుడు తన ప్రయత్నం మానలేదు. గాయపడిన సీతాదేవి వక్షఃస్థలంనుండి స్రవించిన రక్త బిందువుల స్పర్శ వల్ల శ్రీరాముడు నిద్ర నుండి లేచి, జరిగిన సంఘటనను గుర్తించాడు. వెంటనే, "కః క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా? " (మిక్కిలి కోపించిన, ఐదు తలలను కలిగిన పాముతో ఎవడురా ఆటలాడుకుంటున్నాడు?) అని అంటూ క్రోధావిష్టుడై, కాకాసురునిపై తృణాన్ని అభిమంత్రించి, బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం ఆ అసురుని తరిమింది. దానికి చాలా భయపడిన కాకాసురుడు ప్రాణరక్షణ కోసం ముల్లోకాలలో అంతటా మాటిమాటికి తిరిగి ఎక్కడా, ఎవరివల్లా, రక్షణను

పొందలేక, చివరికి శ్రీరాముని పాదాల పైన " శ్రీరామా! ఆశ్చర్యకరమైన శక్తిని కలవాడా! నీవే నాకు దిక్కు" అని అంటూ పడ్డాడు. సీతాదేవి పురుషకారంతో శ్రీరాముడు అతనిని క్షమించాడు. అతడు చేసిన అపరాధానికి శిక్షగా అతని రెండు కన్నులలో ఒక కన్నును బ్రహ్మాస్త్రానికి ఎరగా చేశాడు.

ఇది ఐదవ గుర్తు. చివరిగా, ఆరవ గుర్తును సీతాదేవికి హనుమంతుడు తెలియజేస్తున్నాడు.

**"పొన్నొత్త మాన్ ఒన్రు పుగుందినిదు విళైయాడ నిన్నన్బిన్ వழிనిన్రు శిలై పిడిత్తు ఎంబిరాన్ ఏగ, ప్పిన్నే యంగు ఇలక్కుమణన్ పిరిందదువుమ్"**

(పెరియాழ்వార్ తిరుమొழி– 3– 10– 7)

బంగారు రంగును, రత్నాల రంగులో గుర్తులను కలిగిన ఒక జింక మీ పర్ణశాలలో ప్రవేశించి, అందంగా సంచరిస్తూ ఉండగా, నీ కోరికను అనుసరించి శ్రీరాముడు దానిని పట్టుకోవడం కోసం విల్లును ధరించి, బయలుదేరి వెళ్లడం, ఆ తరువాత లక్ష్మణుడు నిన్ను విడచి వెళ్లడం.

రావణుని ఆజ్ఞను అనుసరించి మారీచుడు బంగారు జింక రూపంలో శ్రీరాముడు, సీతాదేవి నివసించే ఆశ్రమానికి సమీపంలో సంచరించడం ఆరంభించాడు. ఆ జింకను చూచిన సీతాదేవి, దానిచే ఆకర్షింపబడి, మా మృగాన్ని పట్టుకొని తీసుకొని రావలసినదిగా శ్రీరాముని కోరింది. సీతాదేవి పై ఉండే అనురాగం కారణంగా శ్రీరాముడు ఆమె మాటను కాదనలేక, లక్ష్మణుడు" ఇది రాక్షసమాయ కావచ్చు, అని దానికోసం ప్రయత్నించడం

ప్రమాదానికి కారణం అవుతుంది" అని నివారించినప్పటికీ వినకుండా, ఆ జింకను వేటాడి పట్టుకోవడం కోసం ధనుర్బాణాలను ధరించి, బయలుదేరాడు. ఏ నాడూ లక్ష్మణుని విడచి, ఒంటరిగా ఎక్కడకు వెళ్ళని శ్రీరాముడు, మాయామృగాన్ని పట్టుకోవడం కోసం ఒంటరిగా వెళ్ళాడు. ఇది ఎవ్వరికీ తెలియని రహస్యం. దీనిని ఒక గుర్తుగా హనుమంతుడు సీతకు చెబుతున్నాడు.

శ్రీరాముడు మాయామృగాన్ని పట్టుకోవడంకోసం వెళ్ళిన తరువాత లక్ష్మణుడుకూడా సీతను విడచి వెళ్లే పరిస్థితి ఏర్పడింది. సీతాదేవి పలికిన కొన్ని మాటల కారణంగా లక్ష్మణుడు ఆశ్రమంలో ఉండలేక సీతను విడచి రాముని కాపాడడం కోసం వెళ్లవలసిన స్థితి ఏర్పడింది.

రామునకు చిక్కకుండా మాయా మృగం చాలా దూరం అతనిని తీసుకొని పోయింది. శ్రీరాముడు చివరకు దానిని పట్టుకోవడం సాధ్యం కాదని అది రాక్షసమాయ అని గుర్తించి ఆ మాయామృగంపై బాణాన్ని ప్రయోగించాడు. మాయామృగ రూపంలో ఉండే మారీచుడు నిజరూపాన్ని పొంది ప్రాణాలను విడుస్తూ, " హా సీతా! హా లక్ష్మణా!" అని రాముని స్వరంతో అరుస్తూ, ప్రాణాలను విడిచాడు. మారీచుని కంఠస్వరాన్ని విన్న సీతాదేవి అది రాముని స్వరమే అని నిర్ణయించి లక్ష్మణుని రాముని రక్షణ కోసం వెళ్లమని చెప్పినది. లక్ష్మణుడు, అది అంతా రాక్షసమాయ అని, భయపడవద్దని చెప్పాడు. దానిని సీతాదేవి వినకుండా, లక్ష్మణుని ఉద్దేశించి

కొన్ని దుర్భాషలను పలికింది. " నీవు నాపై కోరికను కలిగి ఉన్నావు, శ్రీరాముడు మరణించడం నీకు ఇష్టమే. అందుకే నేను చెప్పినట్టు నీవు రాముని రక్షించడం కోసం వెళ్లడం లేదు " అని దూషించింది. లక్ష్మణుడు ఆమె మాటలను వినలేక ఆమెను విడిచి వెళ్ళాడు. ఇది సీతాదేవికి, లక్ష్మణునకు మాత్రమే తెలిసిన రహస్యం.దీనిని ఒక గుర్తుగా హనుమంతుడు సీతతో పలుకుతున్నాడు.

ఈ విధంగా ఆరు విధాలయిన గుర్తులను హనుమంతుడు సీతతో పలికాడు.

**"అయోత్తియర్ కోన్ ఉరైత్త అడైయాళమ్ "**

ఇవి అన్నీ అయోధ్యానగర ప్రభువైన శ్రీరామచంద్రుడు నాకు తెలియజేసిన గుర్తులు. వీటివల్ల సీతాదేవి తన దగ్గరకు వచ్చిన హనుమంతుడు శ్రీరాముని దూతయే అని నిశ్చయించుకున్నది.

ఇప్పుడు, మరింత దృఢనిశ్చయంకోసం మరికొన్ని గుర్తులను చూపిస్తున్నాడు.

ఇక్కడనుండి మూడవ భాగం ప్రారంభం అవుతున్నది.

**"ఈదు అవన్ కైమోదిరమే – ఎన్రు"**

(పెరియాళ్వార్ తిరుమొళి– 3 –10 –8)

"ఇది ఆ శ్రీరామచంద్రుని అంగుళీయకం" అని,

**"అడైయాళమ్ తెరిందురైక్క"**

(పెరియాళ్వార్ తిరుమొళి– 3–10–10)

**గుర్తులను గుర్తించి, తెలుసుకొని చెప్పగా.**

"రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగుళీయకమ్" (సీతాదేవీ! రాముని పేరు ముద్రించబడిన ఈ ఉంగరాన్ని గమనించి చూడు) అని అంటూ హనుమంతుడు శ్రీరాముడు తనకు గుర్తుగా ఇచ్చిన చేతివేలు ఉంగరాన్ని తీసి సీతకు చూపించి ఇచ్చాడు.

**"మలర్ కుళలాళ్ శీదైయుమ్ విల్లిఊత్తాన్ మోదిరమ్ కండు "అనుమాన్! అడైయాళమ్ ఒక్కుమ్" ఎన్ను ఉచ్చిమేల్ వైత్తుకక్క" (పెరియాళ్వార్ తిరుమొళి– 3 –10 –9)**

పూలవలె పరిమళించే కేశాలను కలిగిన, పూలతో అలంకరించదగిన కేశాలను కలిగిన, సీతాదేవి, శివుని ధనస్సును భగ్నం జేసిన శ్రీరాముని ఉంగరాన్ని గ్రహించి, " ఆంజనేయా! నీవు చూపించిన ఈ గుర్తులు సరిగా ఉన్నది" అని దానిని తలపై పెట్టుకొని, సంతోషించగా.

సీతను వివాహమాడడానికి కన్యాశుల్కంగా జనక చక్రవర్తి ఏర్పాటు చేసిన శివధనస్సును శ్రీరాముడు భగ్నం చేశారు అప్పుడు జనకుడు సంతోషంతో శ్రీరాముని వేలుకు శ్రీరాముని పేరును చెక్కిన ఉంగరాన్ని బహుమతిగా తొడిగాడు. ఆ సందర్భాన్ని సీతాదేవి గుర్తు చేసుకుంటూ, ఈ విధంగా అంటున్నది అంతే కాదు, " ఇయం సీతా మమ సుతా సహ ధర్మచరీ

తవ, ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా" (ఈ సీతాదేవి నా కుమార్తె, నీకు సహధర్మచారిణి కాబోతున్నది. ఈమెను పరిగ్రహించు. నీకు శుభమగు గాక! ఈమె చేతిని నీ చేతితో పరిగ్రహించు) అని తన తండ్రి అన్నప్పుడు, ఆ అంగుళీయకాన్ని ధరించిన చేతితోనే తన పాణిని శ్రీరాముడు గ్రహించాడు – అనే వృత్తాంతాన్ని కూడా ఆమె ఇక్కడ గుర్తు చేసుకుంటున్నది. అంతే కాదు, శ్రీరాముడు వనవాసానికి వెళ్ళినప్పుడ అన్ని ఆభరణాలను విడిచిపెట్టినప్పటికీ, జనక చక్రవర్తి తనకు బహుమతిగా ఇచ్చిన ఆ ఉంగరాన్ని మాత్రం తన చేతికి ధరించి వెళ్లాడు. అటువంటి విలక్షణం అయిన అంగుళీయకం అది.– అని సీతాదేవి గుర్తు చేసుకుంటున్నది. " గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్, భర్తార మివ సంప్రాప్తా జానకీ ముదితా ఽ భవత్" (ఆ ఉంగరాన్ని సీతాదేవి హనుమంతుని దగ్గర నుండి తీసికొని, దాని వైపే చూస్తూ, ఆ ఉంగరాన్ని ధరించిన శ్రీరాముని వేలును స్మరించింది. దానితో పాటు ఆ వేలును కలిగిన శ్రీరాముని చేతిని స్మరించింది. ఆ చేతిని కలిగిన శ్రీరాముని బాహువును స్మరించింది. దాని ద్వారా శ్రీరాముని రూపాన్ని సమగ్రంగా స్మరించింది. భావనాప్రకర్షవల్ల సాక్షాత్తు శ్రీరాముని తిరిగి కలిసినపుడు పొందే ఆనందంతో సమానమైన ఆనందాన్ని పొందినది. ఇతనే ఆమె కన్నులనుండి ఆనందాశ్రువులు స్రవించాయి.

ఇంతటితో మూడవ భాగం పూర్తి అయింది.

ఇక్కడనుండి నాలుగవ భాగం ప్రారంభం అవుతున్నది. ఇందులో హనుమంతుడు లంకను ధ్వంసం చేయడం తెలుపబడింది.

ఈ విధంగా హనుమంతుడు సీతను అన్వేషించి, ఆమె వివరాలను అన్నిటినీ తెలిసికొన్న తరువాత, రావణుని బలం ఎంతటిదో కూడా తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు.

**"తిఱల్ విళంగు మారుదియుమ్"**

(పెరుమాళ్ తిరుమొழி– 10– 11)

**బలం ప్రకాశించే హనుమంతుడు కూడా**,

ఇక్కడ ఈ సందర్భంలో, "తిఱల్ విళంగు" అనే విశేషణంలోని తాత్పర్యం ఏమంటే, రాముడు ఇచ్చిన అంగుళీయకాన్ని సీతకు చూపించి, అతడు చెప్పిన గుర్తులను అన్నిటిని ఆమెకు తెలియజేసి, హనుమంతుడు సీతాదేవి మనస్సును సంతోషపెట్టి,, తన స్వరూపానికి తగిన కైంకర్యాన్ని చేశాడు. అందువల్ల అతడు ఆమె పూర్ణకటాక్షానికి పాత్రం అయ్యాడు. ఆ విధంగా లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవి కటాక్షం పరిపూర్ణంగా పొందినందు వల్ల ఏర్పడిన బలం హనుమంతునిలో ప్రకాశించడం ఈ విశేషణం తెలుపుతున్నది. ఈ సందర్భంలో హనుమంతునిలో బలం విశేషంగా ప్రకాశించడాన్ని సీతాదేవి "విక్రాంతః త్వం సమర్థః త్వం ప్రాజ్ఞః త్వం వానరోత్తమ!" అని అంటూ తన కటాక్షంతో హనుమంతుని విశేషంగా అనుగ్రహించినందువల్ల అతనిలో బలం పరిపూర్ణంగా ప్రకాశించినది.

**"ఇలంగైయర్ కోన్" (పెరియ తిరుమొழி -8 -5 -7)**

**లంకకు అధిపతి అయిన రావణుని,**

**"మాక్కడి కావై యిఱుత్తు కాదల్ మక్కళుమ్ శుற்றముమ్ కొన్రు కడి ఇలంగై మలంగ ఎరిత్తు"**

(పెరియ తిరుమొழி- 10- 2 - 6)

సువాసనను కలిగిన,గొప్ప వనమైన అశోకవనాన్ని ద్వంసం చేసి, అతనికి ఇష్టమైన కుమారులను బంధువులను చంపి, సువాసనతో కూడిన తోటలను కలిగిన లంకను దగ్ధం చేసి,

రావణుని బలం ఎంతటిదో తెలుసుకోవడం కోసం ఏది ఉపాయం? అని ఆలోచించిన హనుమంతుడు, రావణునకు ఇష్టమైన అశోకవనాన్ని పాడుచేసి, లంకలో ఉండే రాక్షసులను కవ్వించి, వారిని యుద్ధానికి పురికొల్పాడు. తనతో యుద్ధానికి సిద్ధపడిన అక్షయకుమారుడు మొదలైన పలువురు రాక్షసులను, రావణుని ప్రియపుత్రులను, అనుచరులను, బంధువులను సంహరించాడు. చివరకు ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి కట్టుబడి, అతని చేత రావణుని సభకు తీసుకుని పోబడ్డాడు. అక్కడ రావణుని చూసి, అతనికి తగిన హితోపదేశాన్ని చేశాడు. కానీ, రావణుడు హనుమంతుడు చేసిన ఉపదేశాన్ని వినకుండా, అతనిపై కోపించి, అతనిని వధించాలని ప్రయత్నం చేశాడు. విభీషణుడు దూతను వధించడం తగదని చెప్పిన మాటకు అంగీకరించి, హనుమంతుని తోకకు నిప్పు

అంటించి, తగినట్లు శిక్షించమని తన అనుచరులను ఆజ్ఞాపించాడు. రావణుని ఆజ్ఞ ప్రకారం రాక్షస వీరులు హనుమంతుని తోటకు నిప్పు పెట్టారు. ఆ అగ్నినే ఉపయోగించి హనుమంతుడు లంకానగరాన్ని అంతటినీ దగ్ధం చేశాడు. అంతవరకు అగ్నిదేవునకు ఆరాధనా రూపాలైన యజ్ఞయాగాదులను ఇంత కాలంగా అడ్డుకున్నాడు. ఆ కొరత తీరేటట్టుగా హనుమంతుడు లంక నగరాన్ని అంతటినీ అగ్నికి ఆహుతి చేశాడు.

**"అరక్కర్ కోన్" (తిరు నెడుందాండకమ్– 29)**

రాక్షస ప్రభువు అయిన రావణుని

**"శిన మழித்து" (పెరియ తిరుమొழி– 8 –6– 9)**

గర్వాన్ని అంతటినీ నాశనం చేసి.

"నేనే రాక్షస రాజును, అందమైన లంకా నగరానికి అధిపతిని" అనే గర్వాన్ని ఇంతకాలంగా రావణుడు కలిగి ఉన్నాడు. హనుమంతుడు, రావణుని పుత్రులను, వీరులను పలువురను సంహరించి, అందమైన లంకానగరాన్ని కాల్చి బూడిద చేసి, రావణుని ఆ గర్వాన్ని అణచివేశాడు.

ఇక, చివరిది అయిన ఐదవ విభాగంలో, హనుమంతుడు శ్రీరాముని దగ్గరకు తిరిగి వచ్చి, సీత వివరాలను తెలియజేయడం వర్ణింపబడింది.

**"మీండు అన్బినాల్"(తిరుక్కుఱుందాండగమ్ – 15)**

తిరిగి వచ్చి భక్తితో

**"అయోత్తియర్ కోన్"**

(పెరియాళ్వార్ తిరుమొళి–3–10 –8)

అయోధ్యకు అధిపతి అయిన శ్రీరాముని

**"తళిర్పురైయుమ్"(తిరు నెడుందాండకమ్–1)**

చిగురు వలె సుకుమారమైన

**"అడియిణై పణియ,"**

(తిరుప్పళ్ళి ఎళుచ్చి) (తిరుక్కుఱుందాండగమ్– 15)

రెండు పాదాలను సేవించగా.

ఇంత కాలంగా నిరాహారుడై, విశాలమైన సముద్రాన్ని దాటి, లంకలోకి వెళ్లి సీతను వెదకి, లంకలో ఉండే రాక్షసులతో యుద్ధం చేసి, ఇన్ని కార్యాలను చేసి ఎంతో శ్రమపడినప్పటికీ, శ్రీరాముని పట్ల ఏమాత్రం భక్తి తగ్గనివాడై, భక్తి నిండిన హృదయంతో శ్రీరాముని పాదాలను హనుమంతుడు సేవించాడు.

ఇంతకాలంగా సీత ఎక్కడ ఉన్నదో, ఏ విధంగా ఉన్నదో తెలియలేక, క్లేశపడుతున్న శ్రీరాముని పాదాలు శుష్కించి పోయిన చిగురువలె ఉన్నాయి. కానీ, ఇప్పుడు, హనుమంతుడు సీతాదేవి సురక్షితంగా ఉన్నదని చెప్పగానే, సంతోషించిన శ్రీరాముని పాదాలు చిగురువలె చాలా సుకుమారమైనవి అయ్యాయి. అటువంటి సుకుమారమైన, చిగురువంటి శ్రీరాముని పాదాలను హనుమంతుడు సేవించాడు – అనే స్వారస్యం "తళిర్ పురై" అనే ప్రయోగంవల్ల ధ్వనిస్తున్నది.

# యుద్ధకాండమ్

ఇందులో మొత్తం 38 వాక్యాలు ఉన్నాయి. వీటిని ఆరు విభాగాలుగా చేయవచ్చు.

వీటిలో, మొదటి విభాగం విభీషణశరణాగతి.

మంతుడు లంకలో సీతను చూసి ఆమెకు సంబంధించిన వివరాలను శ్రీరామునకు తెలియజేసిన తరువాత, శ్రీరాముడు లంకకు చేరి, రావణునిపై యుద్ధాన్ని చేసి,సీతను రక్షించే ప్రయత్నాన్ని ఆరంభించాడు. "ఊర్ధ్వం మాసా న్న జీవిష్యే" (ఒక నెలకు మించి శ్రీరాముని విడచి నేను బతకలేను) అని సీత చెప్పిన మాటను హనుమంతుడు శ్రీరామునకు తెలియజేసినందున, త్వరగా సీతను రక్షించవలసిన ఆవశ్యకత శ్రీరామునకు కలిగింది. అంతకు మించి శ్రీరాముడు "న జీవేయం క్షణమపి వినా తా మసితేక్షణామ్" (నల్లని కన్నులను కలిగిన ఆ సీతను విడచిపెట్టి, ఒక్క క్షణం కూడా నేను జీవించలేను) అని శ్రీరాముని స్థితి ఉన్నది. అంతే కాకుండా, 14 సంవత్సరాల వనవాసం కూడా పూర్తి అయ్యే గడువు కూడా దగ్గర పడుతున్నది. అందువల్ల శ్రీరాముడు పీతను రక్షించే ప్రయత్నాన్ని వెంటనే ఆరంభించాడు.

**"కాన ఎంగుమ్ కురంగుమ్ ముశువుమ్ పడైయా"**

(పెరియ తిరుమొழி– 6 –10 –6)

అరణ్యంలో సంచరించే భల్లూకాలను, వానరాలను(కోతులను), గోలాంగూలాలను (కొండముచ్చులను) సైన్యంగా చేసికొని.

లంకానగరం పేరును, రావణుని పేరును చెబితే చాలు, దేవతలు సైతం గడగడ వణకి పోతారు. అటువంటి లంకానగరాన్ని పాలించే రావణునిపై యుద్ధం చేయడానికి శ్రీరాముడు చాలా భీరుస్వభావాన్ని కలిగిన, చంచల స్వభావాన్ని కలిగిన వానరులను సేనగా చేసికొన్నాడు. క్రమంగా దక్షిణ సముద్ర తీరాన్ని చేరాడు.

### "కొడియో నిలంగై పుగలுற்று"

(పెరియ తిరుమొழி– 8 –6 –4)

క్రూరుడైన రావణుడు పాలించే లంకానగరాన్ని చేరే ఉపాయాన్ని గూర్చి ఆలోచించి.

రావణుడు ఎంతటి క్రూరుడు అంటే, లోకాలకు అన్నిటికీ తండ్రి అయిన శ్రీరాముడు, తల్లి అయిన జానకి కలసి ఉండడాన్ని చూడలేక, వారిని విడదీసినవాడు. ఏకాంతంగా ఆనందంగా గడపాలని వనవాసానికి వచ్చిన శ్రీరాముని, సీతను విడదీసిన పాపాత్ముడు. అందువల్లనే గోదాదేవి ఇతనిని "పొల్లా అరక్కన్" అని అన్నది. అటువంటి రావణుడు పాలించే లంకానగరాన్ని చేరే ఉపాయం ఏది ? అని శ్రీరాముడు ఆలోచించాడు. శ్రీరాముడు సర్వేశ్వరుడు అయినప్పటికీ, ఏ కార్యాన్ని అయినా సంకల్ప మాత్రం చేతనే నిర్వహించగలిగిన శక్తిని కలిగినవాడు అయినప్పటికీ, శ్రీరామావతారంలో మానవమాత్రుడను అనే భావం కలిగినవాడు కనుక, దానికి అనుగుణంగా, దక్షిణసముద్రాన్ని ఏ విధంగా దాటాలి? అనే

ఉపాయచింతనను చేశాడు. అందువల్ల, ఇది భగవానుని అవతారసత్యత్వానికి చిహ్నం.

**"అలైయార్ కడఱ్కరై వీఱ్ఱిరుందు"**

(పెరియాழ்వార్ తిరుమొழி– 4–1–3)

కెరటాలతో నిండిన దక్షిణ సముద్రతీరంలో గంభీరంగా వేంచేసి ఉండి.

ఇటువంటి సన్నివేశంలో, రావణునిచేత లంకారాజ్య బహిష్కారాన్ని చేయబడిన విభీషణుడు వచ్చి, శ్రీరాముని చరణాలలో ఆశ్రయించాడు.

**"శెల్వ విబీడణఱ్కు నల్లానాయ్"**

(పెరియ తిరుమాழி– 6– 8– 5)

శ్రీమంతుడైన విభీషణుని విషయంలో అనుగ్రహాన్ని చూపినవాడై.

ఇప్పుడు విభీషణుడు " త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ" అని తన సంపదను, బంధుమిత్రులను,భార్యాపుత్రులను వదిలిపెట్టి, తన అనుచరులు నలుగురితో మాత్రం కలసి, శ్రీరాముని దగ్గరకు శరణ కోరి వచ్చాడు. ఇటువంటి విభీషణుని ఆళ్వారులు " శెల్వ విబీడణన్ " – సంపద కలిగిన విభీషణుడు" –అని గొప్పగా నిర్దేశించడంలో ఏమి తాత్పర్యం? అని అంటే,

విభీషణుడు లౌకికమైన సంపదను పోగొట్టుకుంటే ఏమి నష్టం? అపూర్వమైన, అలౌకికమైన, ఏనాటికి తరగనిది అయి శ్రీరాముని కైంకర్యమనే లక్ష్మిని, ఆ స్వామిని శరణాగతి చేసి పొందబోతున్నాడు కదా! అందువల్ల ఈ

విధంగా విశేషింపబడ్డాడు. అంతే కాదు, శ్రీరాముని దగ్గర నుండి కులధనం అనదగిన శ్రీరంగనాథుని త్వరలో పొందబోతున్నాడుకూడా.

అది సరియే. శ్రీరాముని శరణు వేడిన తరువాత విభీషణుని ఈ విధంగా విశేషించి పలకడం తగినదే కానీ, ఆశ్రయించడానికి ముందుగానే ఈ విధంగా విశేషించి పలకడంలో ఏమి విశేషం ? అని అంటే, ఈ విధంగా శ్రీరాముని ఆశ్రయించడానికి ముందుగానే విభీషణుని "లక్ష్మిని కలిగినవాడు" అని ఆళ్వారులు అనడం శ్రీరాముని పట్ల ఆభిముఖ్యాన్ని కలిగినవాడై, ఆ స్వామిని శరణు పొందడం కోసం వచ్చే విభీషణుని ఉద్దేశించి " అంతరిక్షగతః శ్రీమాన్" అని వాల్మీకి మహర్షి పలికిన సూక్తిని అనుసరించడమే.

"శెల్వ విభీడణన్ "అనే తిరుమంగై మన్నన్ సూక్తిని వ్యాఖ్యానిస్తూ, వ్యాఖ్యాన చక్రవర్తి శ్రీకృష్ణ సూరి "విభీషణుడు ఏ సమయంలో రావణుని భవనాన్ని విడచి లంకా నగరాన్ని విడచి బయటకు వచ్చాడో, అప్పుడే అతడు సంపదను నిండినవాడయ్యాడు " – అని అన్నారు. ఇందువల్ల భగవంతుని సంకల్పానికి విరుద్ధంగా ప్రవర్తించకపోవడం అనే ప్రాతికూల్య వర్జనం, "భగవంతునకు అనుకూలంగా ప్రవర్తించాలి "అని నిశ్చయించుకోవడం అనే అనుకూల్యసంకల్పమే చాలు, భగవంతుడు జీవులను రక్షించడానికి – అనే రహస్యం ఇక్కడ సూచింపబడింది.

"విబీడణఱ్కు నల్లానాయ్" విభీషణం విషయంలో శ్రీరాముడు స్నేహాన్ని కలిగినవాడయ్యాడు– అని అనడంలో ఏమి తాత్పర్యం అంటే,

విభీషణుడు చేసిన శరణాగతిని శ్రీరాముడు స్వీకరించాడు – అనే అర్థం ఈ ప్రయోగం ద్వారా వ్యక్తం చేయబడింది.

విభీషణుడు తన నలుగురు అనుచరులతో కలసి లంకనుండి బయటకు వచ్చి, శ్రీరాముని సమీపానికి చేరి, ఆకాశంలోని నిలచి ఉండి వానరవీరులను ఉద్దేశించి ప్రార్థిస్తూ " సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే, నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్" (అన్ని లోకాల లో ఉండే అందరికీ శరణు పొందదగినవాడు, మహాత్ముడైన రాఘవుని సన్నిధిలో ఆ స్వామిని శరణాగతి చేయడం కోసం వచ్చిన విభీషణుడు అనే నన్ను గూర్చి వేగంగా నివేదించండి) అని ప్రార్థించాడు. సుగ్రీవుడు, జాంబవంతుడు, అంగదుడు మొదలైన వానరవీరులు విభీషణుడు నమ్మదగినవాడు కాదని, శ్రీరాముడు విభీషణుని పరిగ్రహించకూడదని అన్నారు. హనుమంతుడు విభీషణుడు ఏ దోషం లేనివాడు కనుక, అతనిని శ్రీరాముడు స్వీకరించవచ్చునని అన్నారు వీరందరి అభిప్రాయాలను పూర్వపక్షం చేస్తూ,

**"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన,**
**దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేతదగర్హితమ్"**

(మిత్రుడననే భావంతో నా దగ్గరకు వచ్చినా చాలు. అతనిని ఏ విధంగానూ నేను విడచిపెట్టను. అతనిలో దోషం ఉండడం అనేది పరిగ్రహించడానికి అవరోధం కాదు. ఇది సత్పురుషుల అభిప్రాయానికి విరుద్ధం కాదు.) అని,

**"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,**

**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"**

(ఒక్కసారి శరణాగతి చేసినవానికి, " నేను నీ వాడను, నన్ను రక్షించు" అని యాచించినవానికి, సకల ప్రాణులనుండి నేను అభయాన్ని కలిగిస్తాను. ఇది నా వ్రతం)

అని అంటూ శ్రీరాముడు, విభీషణుని శరణాగతిని అంగీకరించి, అతనిని తన సోదరులతో సమానంగా భావించి, స్వీకరించి, ఆదరించాడు.

**"విరినీర్ ఇలంగై అరుళి " (తిరువాయ్ మొఝి– 7 –6 –9)**

విస్తరించిన జలాన్ని కలిగిన సముద్రాన్ని చుట్టూ కల లంకానగర సామ్రాజ్యానికి ప్రభువుగా అతనిని పట్టాభిషిక్తుని చేసి.

సముద్రాన్ని దాటడానికి ముందే, రాక్షసులతో యుద్ధం చేయడానికి ముందే, రావణుని వధించడానికి ముందే, శ్రీరాముడు సముద్రతీరంలోనే విభీషణుని లంకానగరానికి ప్రభువుగా అభిషేకం చేశాడు.

విభీషణుడు శ్రీరామునకు కైంకర్యం చేయాలని కదా శరణాగతి చేశాడు. లంకారాజ్యాధికారాన్ని కోరలేదు కదా. మరి, శ్రీరాముడు అతనిని లంకానగరానికి అధిపతిగా చేయడంలో తాత్పర్యం ఏమి? అని అంటే, ఒక ప్రపన్నుడు భగవంతుని ఉద్దేశించి నీవే గతి నీవే నాకు ప్రాప్యం అని ఆశ్రయించినప్పటికీ, పరమోదారుడైన భగవానుడు తన సేవను ఆ ప్రపన్నునకు అనుగ్రహించడమే కాకుండా, తన అవుదారియం కారణంగా అతడు అర్థించని ఇతర పురుషార్థాలను కూడా అనుగ్రహిస్తాడు. అది

భగవంతుడు అనుగ్రహించిన ప్రసాదంగా ఆ ప్రపన్నుడు స్వీకరించి, అనుభవించడంలో ఏ అవరోధం లేదు. అంతే తప్ప, మనం స్వయంగా ఆశపడి, లౌకికపురుషార్థాలను కోరి పొందితే, అది తగని కార్యమే అవుతుంది. అది అనర్థానికి కారణం అవుతుంది –అనే రహస్యం ఇక్కడ సూచింపబడింది. ఇటువంటి భావాన్ని ఆళ్వార్ల దివ్య ప్రబంధాలలోని ఫలశ్రుతి పాశురాలలో మనం గమనించవచ్చు. " వైయమ్ మన్ని వీற்றிరుందు, విణ్ణు మాళ్వర్ మణ్ణోడే" (ఈ భూలోకంలో స్థిరంగా నిలచి ఉండి, పరమపదంతో పాటు ఈ భూమిని కూడా పాలిస్తారు) అని మొదలైన ప్రయోగాలు గమనించదగినవి.

ఇక్కడనుండి రెండవ విభాగం ప్రారంభం అవుతున్నది. ఇందులో, సేతుబంధం వర్ణింపబడింది.

విభీషణుని లంకానగరానికి ప్రభువుగా అభిషిక్తుని చేసిన తరువాత, శ్రీరాముడు, సముద్రాన్ని దాటడానికి తగిన ఉపాయాన్ని గూర్చి విభీషణుని ప్రశ్నించగా అతడు తనకు తెలిసిన, ఫలించిన విద్య అయిన శరణాగతియే దానికి తగిన ఉపాయం అని భావించి, సముద్రుని శరణాగతి చేయడం తగిన ఉపాయం అని అన్నాడు. శ్రీరాముడు, ఆ క్రమంలోనే, " అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః" అని సముద్రతీరంలో తూర్పుముఖంగా సముద్రానికి అభిముఖుడై పరుండి, సముద్రుని శరణాగతి చేశాడు. (శ్రీరాముడు శాస్త్రప్రకారం శరణాగతి చేసినప్పటికీ, సముద్రునిలో

శరణ్యలక్షణాలు పూర్ణంగా లేవు కనుక, శ్రీరాముడు సముద్రుని ఉద్దేశించి చేసిన శరణాగతి ఫలించలేదు. అంతేకాదు, శరణాగతి చేసేవాడు అనన్యశరణుడై, అకించనుడై ఉండాలి. కానీ, శ్రీరాముడు సర్వశక్తి. అన్ని విధాలయిన సామర్థ్యాలను కలిగినవాడు. అందువల్ల కూడా ఆ శరణాగతి ఫలించలేదు. మరి శ్రీరాముడు సర్వజ్ఞుడు కదా తాను చేసే శరణాగతి ఫలించదు అని తెలిసినప్పటికీ ఎందుకు చేశాడు అనే సందేహం ఎక్కడ కలుగవచ్చు. తనను ఆశ్రయించిన విభీషణుని విషయంలో ఉండే వాత్సల్యమే శ్రీరాముని ఆ విధంగా శరణాగతి చేసేటట్లు ప్రేరేపించింది).

మూడు దినాలు గడచినప్పటికీ సముద్రుడు ప్రత్యక్షం కాలేదు. అప్పుడు శ్రీరాముడు సముద్రునిపై కోపించి, “లక్ష్మణా! సముద్రంలోని నీటిని అంతటినీ ఇంకింప చేస్తాను. వానరవీరులు పాదచారులై లంకానగరాన్ని చేరనీ” అని అంటూ తన వింటిలో బాణాన్ని సంధించాడు. సముద్రుడు చాలా భయపడి, శ్రీరాముని ముందు ప్రత్యక్షమై, అతని పాదాలపై పడ్డాడు.

**(శరణ్ పుక్క) “కురై కడలై అడలంబాల్ మఱుగ ఎయ్ దు”**

(పెరుమాళ్ తిరుమొழி–10– 7)

(శ్రీరాముడు సముద్రుని శరణు పొందగా) కెరటాల ధ్వనితో ఘోషించే సముద్రంపై పదునైన బాణాన్ని బ్రహ్మాస్త్రాన్ని అభిమంత్రించి అతడు కలత చెందేటట్లు ప్రయోగించి.

ఇక్కడ, సముద్రుని కెరటాల ధ్వనిని ప్రస్తావించడంలో ఏమి తాత్పర్యం? అంటే, "నీ కెరటాల ధ్వనివల్ల నీవు నా శరణాగతిని వినలేదనుకుంటాను. నా బాణప్రయోగాన్ని అయినా గమనిస్తావుకదా – అని శ్రీరాముడు భావించి సముద్రునిపై బాణాన్ని సంధించి, ప్రయోగించాడు –అనే అర్థం స్ఫురించడంకోసం ఇక్కడ సముద్రుని కెరటాల ప్రస్తావన చేయబడింది.

శ్రీరాముడు తన వింటిలో బాణాన్ని సంధించగానే, సముద్రుడు భయంతో ప్రత్యక్షమై శ్రీరాముని సన్నిధిలో శరణాగతి చేశాడు. శరణాగతుడైన అతనిని క్షమించి, శ్రీరాముడు తాను సంధించిన బాణాన్ని సముద్రం మధ్యలో ఉండే, సముద్రుని బాధించే అసురులపై ప్రయోగించాడు. సముద్రుని సహకారంతో శ్రీరాముడు వారధిని నిర్మించాడు.

### "కొల్లై విలంగు పణి శెయ్య"(పెరియ తిరుమొழி –8– 6– 4)

అరణ్యమృగాలయిన భల్లూకాలు, వానరులు, గోలాంగూలాలు సేవ చేయగా,

తిరువడి (గరుడుడు) తిరువనందాழ்వాన్ (ఆదిశేషుడు), సేనాపతి அழ்వాన్ (విష్వక్సేనులు) చేయదగిన భగవంతుని సేవలను వనమృగాలు చేశాయి.

"కొల్లై విలంగు" అనే ప్రయోగం వల్ల అరణ్యంలో సంచరించే శాఖామృగాలే కాకుండా, ఉడతలవంటి వన జంతువులు కూడా సేతుబంధన సేవలో పాలు పంచుకున్నాయి – అనే రహస్యం సూచింపబడింది.

మహర్షులకు సైతం గోచరించని కొన్ని లీలలను భగవానుడు దివ్యసూరులకు దర్శింప చేశాడు. అటువంటి లీలలలో ఈ ఉడత వృత్తాంతం ఒకటి. దీనిని పత్తాంఘ్రేణువు భక్తాంఘ్రిరేణువు అని పిలువబడే తొండర్ ఆడి ప్పొడి ఆళ్వార్లు తిరుమాలై ప్రబంధంలో " కురంగుగళ్ మలైయై నూక్క కుళిత్తు త్తామ్ పురండిట్టోడి, తరంగనీర్ అడంగలుற்ற శలమిలా వణిలుమ్ పోలే" అని అంటూ సేతువును కట్టేటప్పుడు ఉడత కూడా తన వంతు సేవను చేసింది –అనే అపూర్వమైన వృత్తాంతాన్ని అనుసంధించారు. శ్రీరాముడు వానరుల ద్వారా సేతువును నిర్మింప చేసేటప్పుడు, ఒక ఉడత సముద్రంలోకి వెళ్లి స్నానం చేసి, తీరానికి వచ్చి, ఇసుకతిన్నెపై దొర్లి, తన శరీరానికి అంటుకున్న ఆ ఇసుక రేణువులను, సేతునిర్మాణంలో అందించింది, ఈ విధంగా యథోచితంగా సేవను చేసి, రాముని అనుగ్రహాన్ని పొందింది –అనే వృత్తాంతాన్ని ఆళ్వార్లు తమ ప్రబంధంలో గానం చేశారు.

**"మలైయాల్ అణై కట్టి"(పెరుమాళ్ తిరుమొழி –8 –8)**

కొండలవంటి పెద్ద పెద్ద శిలలతో సేతువును కట్టి.

సాధారణంగా శిలలు నీటిలో మునిగిపోతాయి. కానీ, సముద్రుడు శ్రీరామునకు ఇచ్చిన మాట వల్ల, వానరులు సముద్రంలో పడవేసిన శిలలు అన్నీ నీటిపై తేలాయి. ఈ శిలలతో వానరుల ద్వారా శ్రీరాముడు చేతు నిర్మాణాన్ని కావించాడు.

**"మఱు కరై ఏఱ్టి "(పెరుమాళ్ తిరుమొళి– 10– 7)**

సముద్రానికి ఆవలి తీరాన్ని చేరి.

ఇక్కడనుండి మూడవ విభాగం ప్రారంభం అవుతున్నది. ఇందులో, రావణునితో యుద్ధం చేసి, రాక్షస సైన్యాన్ని రావణుని వధించడం వర్ణింపబడింది. వాల్మీకి రామాయణం ప్రకారం కుంభకర్ణుడు, నికుంభుడు మొదలైనవారు ముందుగానే వధింపబడ్డారు. ఆ తరువాత, ఐదవ నాడు ఇంద్రజిత్తు వధ జరిగింది. ఏడవ నాడు రావణుని వధ జరిగింది.

**"ఇలంగై పొడి పొడియాగ "(శిఱియ తిరుమడల్– 26)**

లంకానగరం చూర్ణం చూర్ణం అయ్యేటట్టుగా.

వరబల భుజబలాలతో అప్రధృష్యంగా ఉండే రాక్షసులు నివసించే లంకానగరాన్ని శ్రీరాముడు పొడి పొడి చేశాడు.

**"శిలై మలి శెంజరంగళ్ శెల వుయ్ త్తు"**

(పెరియ తిరుమొళి –11– 4 –7)

వింటిలో విస్తరించిన, గొప్పవి అయిన బాణాలను పరంపరగా ప్రయోగించి.

శ్రీరాముడు మూలబలంతో యుద్ధం చేసేటప్పుడు, అసంఖ్యాకంగా బాణప్రయోగాన్ని చేసి, రాక్షసులను " ఛిన్నం భిన్నం శరైః దగ్ధమ్" అనే విధంగా ఖండఖండాలుగా, పొడిపొడిగా, బూడిదగా చేశాడు. శ్రీరాముడు ప్రయోగించిన బాణాలకు,

**"కుంబనొడు నికుంబనుమ్ పడ"**

(పెరియ తిరుమొழி– 10– 2 –5)

కుంభునితోపాటు నికుంభుడు కూడా మరణించగా.

కుంభుని సుగ్రీవుడు వధించాడు. నికుంభుని హనుమంతుడు వధించాడు.

**"ఇందిరశిత్తழிయ, క్కుంబకరణన్ పడ"**

(పెరియ తిరుమొழி– 10– 3 –2)

ఇంద్రజిత్తు నశించగా, కుంభకర్ణుడు సంహరింపబడగా.

ఇంద్రజిత్తును లక్ష్మణుడు వధించాడు. ఏ అస్త్రంతోను ఇంద్రజిత్తును వహించడం సాధ్యం కాని సమయంలో లక్ష్మణుడు

"ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది,

పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్"

(దశరథ పుత్రుడైన శ్రీరాముడు ధర్మాత్ముడు, సత్యవాక్ పరిపాలకుడు పౌరుషంలో సాటి లేనివాడు అయినట్లయితే, ఓ బాణమా!నీవు రావణుని పుత్రుడైన ఇంద్రజిత్తును వధించు) అనే శ్లోకాన్నే మంత్రంగా చేసికొని, అభిమంత్రించి, బాణాన్ని ప్రయోగించి, ఇంద్రజిత్తును వధించాడు. కుంభకర్ణుని శ్రీరాముడు వధించాడు. వీరే కాకుండా, ఎంతమందో రాక్షస వీరులు వధింపబడ్డారు.

## "అరక్కరావి మాళ" (పెరియ తిరుమొழி– 4 –8 –5)

రాక్షస సైన్యం అంతా నశించగా.

సీతాదేవి విశ్లేషానికి రావణుడు ఒక్కడు మాత్రమే హేతుభూతుడు అయినప్పటికీ, అతడు చేసిన పాపప్రభావం వల్ల అతనితో సంబంధం కలిగిన లంకలో ఉండే రాక్షసులు అందరూ నశించి పోయారు. ఇందువల్ల, ఒకడు చేసిన దుష్కృతంయొక్క ఫలాన్ని అతడే కాకుండా, అతనికి సంబంధించిన పలువురు కూడా అనుభవించవలసి ఉంటుంది – అనే రహస్యం ఇక్కడ సూచింపబడింది. భాగవతాపచార ప్రభావం ఎంతటి ఘోరమైనది అంటే,ఆ అపచారాన్ని చేసినవాడే కాక, అతనికి సంబంధించినవారు కూడా నశించి పోతారు. పరమ భాగవతురాలైన సీతాదేవి విషయంలో రావణుడు చేసిన మహాపచార ప్రభావంవల్లనే లంకానగరం అంతా నశించిపోయింది.

## (అరక్కర్) "కూత్తర్ పోల క్కుழமణి తూరమాడ"

(పెరియ తిరుమొழி–10 –3– 1)

(రాక్షసులు) నృత్యం చేసేవారి వలె, "కుழమణి తూరమ్" అనే నాట్యాన్ని ఆడగా.

పూర్వకాలంలో యుద్ధంలో విజయాన్ని సాధించినవారు "నావలో నావల్, అరైయో అరై" అని అంటూ ఆనందంగా నృత్యాన్ని చేస్తారు. అటువంటిదే "కుழమణి తూరమ్" అనే నాట్యం. ఇది ఓడిపోయినవారు చేసే నాట్యం. ఓడిపోయిన వారు నాట్యం చేయడం ఏమి అని అంటే వారి ఓటమి

ఎత తీవ్రమైనదో, ఎంతటి క్లేశాన్ని కలిగించిందో, ఆ విషయాన్ని వారు చేసే నాట్యం తెలుపుతున్నది – అని ఇక్కడ భావం.

**"ఇలంగై మన్నన్ ముడి యొరుబదుమ్ తోళిరుబదుమ్ పోయుదిర"**

(పెరియ తిరుమొ**ழி** – 3–9–5)

లంకానగరానికి అధిపతి అయిన రావణుని పది శిరస్సులను, ఇరవై భుజాలను చెదరి కింద పడేటట్లుగా,

**"శిలై వళైత్తు" (పెరియ తిరుమొழி**– 8–5– 5)

తన కోదండాన్ని వంచి, నారిని సంధించి,

**"శరమழை" (తిరుప్పావై** –4)

బాణవర్షాన్ని

**"పొழிన్దు" (పెరియాழ்వార్ తిరుమొழி**– 3– 5– 8)

కురిపించి. (శ్రీరాముడు రావణుని వధించాడు).

ఇక్కడనుండి నాలుగవ విభాగం ప్రారంభం అవుతున్నది. ఇందులో, యుద్ధానంతరం శ్రీరాముని బ్రహ్మాది దేవతలు స్తుతించడం వర్ణింపబడింది.

దేవతల చేసిన ప్రార్థనను అనుసరించి భగవానుడు రావణుని వధించడం కోసం శ్రీరాముడై ఈ లోకంలో అవతరించాడు. ఇప్పుడు రావణుని వధ పూర్తి అయినది. దేవతల క్లేశాలు తీరిపోయాయి. రావణుడు వధింపబడడానికి చూసిన బ్రహ్మాది దేవతలు చాలా సంతోషించి రావణుని

వధించిన శ్రీరాముని యుద్ధరంగంలో స్తుతించారు. ఆ విషయం ఈ విభాగంలో వర్ణింపబడుతున్నది. ఈ విధంగా భగవానుడు శ్రీరాముడై అవతరించిన అవతారంలోని ప్రయోజనం రావణవధతో నెరవేరింది –అనే విషయం ఇక్కడ సూచింపబడింది.

**(కరమ్ తుణిందు) "వెన్ఱి కొండ శెరుక్కళత్తు"**

(పెరియ తిరుమొழி – 6–6–8)

శ్రీరాముడు విజయాన్ని సాధించిన ఆ యుద్ధరంగంలో,

ఎవరికీ వధించడానికి సాధ్యం కాని రావణుని శ్రీరాములడు యుద్ధరంగంలో వధించగానే, ఆ దృశ్యాన్ని దర్శించిన బ్రహ్మాదిదేవతలు చాలా ఆనందించారు శ్రీరాముని స్తుతించారు.

**"కడిక్కమల నాన్ముగనుమ్ కణ్ మూన్ఱత్తానుమ్"**

(నాన్ముగన్ తిరువందాది–42)

ఎల్లప్పుడూ సువాసనను కలిగిన, భగవంతుని నాభీకమలంలో జన్మించినవాడైన, నాలుగు ముఖాలు కలిగినవాడైన బ్రహ్మ, మూడు నేత్రాలను కలిగినవాడైన శివుడు,

"సర్వగంధః" (భగవానుడు అన్ని విధాలయిన సుగందాలను కలిగినవాడు) అని కీర్తింపబడే భగవానుని నాభినుండి ఉద్భవించినది అయినందువల్ల నాభీకమలం ఎల్లప్పుడూ సువాసనను కలిగి ఉంటుంది.

మనకంటే మించిన గొప్ప జ్ఞానాన్ని, శక్తిని కలిగినవాడు అనేదానికి గుర్తుగా మూడు కన్నులను కలవాడు శివుడు.

**"ఎణ్మర్ పదినొరువర్ ఈరఋవర్ ఓరిరువర్"**

(ముదల్ తిరువందాది –52)

అష్ట వసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వనీ దేవతలు అనే 33 మంది దేవతాశ్రేష్ఠులు. ఈ 33 మందికి ఒక్కొక్కరికి కోటి, కోటి మంది గణాలు ఉన్నారు. అందువల్ల దేవతలు 33 కోట్ల మంది అని చెప్పబడతారు.

**"మఱ్ఱుముళ్ళ వానవర్ కళ్" (తిరుచ్చంద విరుత్తమ్– 87)**

ఇంకా మిగిలిన దేవతలు

**"మలర్ మழை పొழிన్దు"**

(తిరువాయ్ మొழி– 10– 9– 3)

పుష్ప వృష్టిని కురిపించగా,

**"మణిముడి పణిదర" (పెరియ తిరుమొழி– 1– 2 –6)**

రత్నాలు పొదిగిన కిరీటాలను ధరించిన దేవతలుతమ శిరస్సులు వంచి,

**"అడియిణై వణంగ"(పెరియ తిరుమొழி– 6– 8 –5)**

శ్రీరాముని రెండు పాదాలకు నమస్కరించి రామునకు తమ కృతజ్ఞతలను తెలిపారు.

ఇక్కడ నుండి 5వ విభాగం ప్రారంభం అవుతున్నది. ఇందులో, సీతను, వానరసేనను తీసుకొని శ్రీరాముడు అయోధ్యకు తిరిగి చేరడం వర్ణింపబడింది.

యుద్ధానంతరం లంకానగరం నుండి పుష్పక విమానం పై శ్రీరాముడు లక్ష్మణునితో, సీతాదేవితో, సుగ్రీవుడు, విభీషణుడు, హనుమానుడు, ఇంకా మిగిలిన వానరసేనతో కలసి, అయోధ్యను చేరాడు.

**"కోల త్తిరుమా మగళోడు"(తిరువాయ్ మ<u>ళి</u>– 6– 9 –3)**

అందమైన, లక్ష్మీ స్వరూపిణి అయిన సీతాదేవితో,

శ్రీరామునకు సాటి వచ్చే అందాన్ని కలిగినది సీతాదేవి. భగవానుడు అవతారాలను స్వీకరించినప్పుడు, ఆ యా అవతారాలకు తగిన విధంగా లక్ష్మీదేవి కూడా అవతారాలను ఎత్తుతుంది. ఆ అవతారాలలో మగవానుని రూపానికి తగిన రూపాన్ని కలిగి ఉంటుంది. " విష్ణోః దేహానురూపాం వై కరోత్యేషాత్మన స్తనూమ్" అని ఈ విషయాన్ని విష్ణుపురాణం వచనం తెలుపుతున్నది. "అనుజను రనురూపా" అని శ్రీ పరాశర భట్టర్ కూడా శ్రీగుణరత్నకోశం అనే లక్ష్మీస్తోత్రంలో అన్నారు.

**"శెల్వ విబీడణన్" (పెరియ తిరుమొ<u>ళి</u>– 6– 8 –5)**

లక్ష్మీసంపన్నుడైన విభీషణుడు.

ఇప్పుడు విభీషణుడు అన్ని విధాలుగాను లక్ష్మీ సంపన్నుడు అయ్యాడు. అతనికి లంకారాజ్యాధిపత్యం లభించింది, రామకైంకర్యం అనే అలౌకిక సంపద కూడా లభించింది.

**"వానర క్కోనుడన్ "**

(పెరియాళ్వార్ తిరుమొళి– 3–10 –8)

వానరులకు ప్రభువైన సుగ్రీవునితో పాటు,

**"ఇలగుమ్ అణి నెడుందేరేఱి" (తిరువాయ్ మొళి– 5–4–9)**

ప్రకాశించే, అందమైన, గొప్ప పుష్పకవిమానాన్ని అధిరోహించి.

ఎంతమంది ఎక్కినప్పటికీ, ఇంకా మరి కొంతమందికి అవకాశాన్ని ఇవ్వగలిగిన సామర్థ్యాన్ని కలిగినది, పుష్పక విమానం. అందువల్ల అది "నెడుం తేర్" అని విశేషింపబడింది. లంకలో ఉండే విభీషణుని పరివారం, సుగ్రీవుని వానర సేన, కిష్కింధలో ఉండే సుగ్రీవుని పరివారం అనే ఇంత మంది ఎక్కినప్పటికీ, ఇంకా అవకాశాన్ని కలిగినది పుష్పకవిమానం.

**"శీరణింద కుగనోడు" (కూడి)**

(పెరియాళ్వార్ తిరుమొళి – 3– 10 –4)

మార్గమధ్యంలో శ్రీరాముడు తనకు ప్రియ మిత్రుడు అయిన గుహుని కలసి, అతనిని, అతని పరివారాన్ని కూడా వెంటబెట్టుకొని వెళ్ళాడు.

ఇంతమందితో కలసి శ్రీరాముడు,

**"అంగణెడు మదిళ్ పుడై శూళ్ అయోత్తి ఎయ్ దు"**

(పెరుమాళ్ తిరుమొళి–10–1)

సుందరమైన,విశాలమైన ప్రదేశాలను కలిగిన, చాలా ఉన్నతాలైన ప్రాకారాలను చుట్టూ కలిగిన అయోధ్యా నగరాన్ని చేరి.

అయోధ్యా నగరంలో ఉండే ప్రజలందరూ అనుభవించి ఆనందించడానికి వీలుగా, ఆ నగరం భోగ్య భోగోపకరణ భోగస్థానాలను కలిగినది. అందువల్ల నగరం విశాలమైనది, అందమైనది. రాముడు వనవాసానికి వెళ్ళినప్పటి సమృద్ధి కంటే పది రెట్లు ఎక్కువ సమృద్ధిని అయోధ్యానగరం కలిగినది కలిగినది అయినది. ఇది అంతా శ్రీరామపాదుకా ప్రభావం అని వాల్మీకి అన్నాడు. రామరాజ్యంలో కూడా ఏదైనా లోపం ఉంటే ఉండవచ్చునేమో కాని, శ్రీరామ పాదుకా రాజ్యంలో మాత్రం ఏ లోటు లేదు. "అంగణెడు మదిళ్ పుడై శూழ் అయోత్తి" అనే ప్రయోగం ఈ విషయాన్ని ధ్వనింప చేస్తున్నది.

ఇక, చివరిగా, ఆరవ విభాగంలో, పాశురప్పడి రామాయణంలోని చివరి భాగమైన శ్రీరాముని పట్టాభిషేకసందర్భం వర్ణింపబడింది.

### "నన్నీరాడి "(తిరువిరుత్తమ్– 21)

పవిత్రమైన నదీజలాలలో స్నానం చేసి.

"పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్" అనే విధంగా భగవానుడు ఎల్లప్పుడూ పవిత్రుడే. అందువల్ల ఆ స్వామి ప్రత్యేకంగా స్నానం చేసి తన విగ్రహాన్ని పవిత్రం చేసుకోవలసిన ఆవశ్యకత లేదు. అయినప్పటికీ సేవించే మనవంటి భక్తులకోసంగా కదా ఆ స్వామి తాను

తిరుమంజనాన్ని స్వీకరిస్తాడు. ఆ విధంగానే శ్రీరామచంద్రుడు కూడా పట్టాభిషేక సమయంలో అయోధ్యానగరంలో ఉండే ప్రజలందరి ఆనందం కోసం, భక్తుల ఆనందం కోసం చతుః సముద్రాలనుండి, పుణ్య నదులలో నుండి తీసుకుని వచ్చిన పవిత్ర జలాలలో స్నానాన్ని స్వీకరించాడు.

**"పొంగిళవాడై అరైయిల్ శాత్తి"**

(పెరుమాళ్ తిరుమొழி– 6–9)

చాలా సున్నితమైన, మృదువైన పట్టుపీతాంబర వస్త్రాలను నడుములో ధరించి.

పుష్పహాస సుకుమారమైన శ్రీరాముని తిరుమేనికి తగినట్లుగా చాలా సున్నితమైన వస్త్రాలను అతడు ధరించాడు. అతి సుకుమారలు అయిన లక్ష్మీదేవి, భూదేవి భగవానుని పాదసంవాహనం చేసేటప్పుడు, చాలా భయంతో స్పృశిస్తారు అని ఆళ్వార్లు " వడివిణై యిల్లా మలర్ మగళ్ మற்ற నిలమగళ్ పిడిక్కుమ్ మెల్లడియై" (రూపంలో సాటి లేని సౌకుమార్యం కలిగిన లక్ష్మీదేవి, భూదేవి మెల్లిగా సంవాహనం చేసే మృదువైన పాదాలు) సూక్తిలో అన్నారుకదా.

**"తిరుచ్చెయ్య ముడియుమ్ ఆరముమ్ కుழையుమ్"**

(తిరువాయ్ మొழி– 8– 4– 7)

కాంతిని వీచే ఎర్రని కిరీటాన్ని, హారాలను, కర్ణకుండలాలను,

**"ముదలా మేదగు పల్ కలన్ అణిందు " (తిరువాశిరియమ్–1)**

ఇంకా ఇటువంటి, తన దివ్య మంగళ విగ్రహానికి అనురూపమైన, పలు గొప్ప ఆభరణాలను అలంకరించుకొని,

వనవాసానికి వెళ్లే సమయంలో శ్రీరాముడు, నవాసానికి అనుగుణంగా అన్ని విధాలయిన ఆభరణాలను విసర్జించాడు. ఇప్పుడు పట్టాభిషేక సమయంలో, దానికి అనుగుణంగా తన దివ్యాభరణాలను అన్నిటిని మళ్లీ అలంకరించుకున్నాడు.

**"శూట్టు నన్ మాలైగళ్ అణిందు " (తిరువిరుత్తమ్– 21)**

కూర్చిన, చక్కని పూలమాలికలను అలంకరించుకొని.

భక్తుడు ప్రీతితో "ఇది భగవంతుని శ్రీచరణాలకు సమర్పించాలి" అని కూర్చిన పూమాలికను భగవానుడు ఎంతో ఆదరంతో స్వీకరించి, తన శిరస్సుపై ధరిస్తాడట. ఇక్కడ "శూట్టు "అనే పదం భగవంతుని సౌలభ్యాన్ని, "నల్" అనే పదం భగవంతుని పరత్వాన్ని సూచిస్తాయి.

**"పరదనుమ్ తంబి శత్తురుక్కనుమ్ ఇలక్కుమణనుమ్ ఇరవు నన్ పగలుమ్"**

(పెరియ తిరుమొழி– 2 –3– 7)

**భరతుడు, గుణపూర్ణుడైన శత్రుఘ్నుడు లక్ష్మణుడు రాత్రింబవళ్లు.**

తన సోదరులు ముగ్గురు సర్వకాలం తన వెంట ఉండి తగిన విధాలుగా

**"ఆట్చెయ్య"**

(తిరుప్పావై– 29), (తిరువాయ్ మొழி– 4 –10– 11)

కైంకర్యాన్ని చేయగా,

**"వడివిణై ఇల్లా"**(తిరువాయ్ మొళి– 9– 2 –1)

రూపసౌందర్యంలో సాటి లేనిది సీతాదేవి.

**"శంగు తంగు మున్నై నంగై " (తిరుచ్ఛంద విరుత్తమ్ – 57)**

గాజులతో ఎల్లప్పుడూ అలంకరింపబడిన ముంజేతిని కలిగిన, స్త్రీత్వపూర్తిని కలిగిన,

సీతాదేవి ముంజేతులు ఎల్లప్పుడూ గాదులతో అలంకరింపబడి ఉండడం ఆ దివ్య దంపతులకు ఏ సమయంలోనో వియోగం లేకపోవడాన్ని సూచిస్తుంది. కానీ శ్రీరామాయణంలో సీతారాములకు వియోగం కలిగినట్లు వర్ణింపబడినది కదా! అని అంటే, అది అంతా అవతార ప్రయుక్తమైన లీలగానే భావించాలి. వాస్తవానికి దివ్య దంపతులకు ఏనాడు వియోగం అనేది లేదు వీరిద్దరూ ఒకే తత్వం అనే విధంగా అపృథక్ సిద్ధ సంబంధంతో ఉంటారని శాస్త్రం చెబుతున్నది కదా. ఉత్తమ జాతికి చెందిన స్త్రీ తన భర్త దూరమైతే, విశ్లేష దుఃఖంవల్ల ఆమె శరీరంలో మార్పు కలిగి, ఆమె ముంజేతికి ధరించిన గాజులు జారి పడిపోతాయి. లక్ష్మీదేవి ముంజేతికి ఉండే గాజులు ఏనాడు జారిపోకుండా, ఎల్లప్పుడూ వాటిని ఆమె అలంకరించుకొని ఉన్నది అని అంటే, ఆ దివ్య దంపతులకు ఏనాడూ, ఏ సమయంలోను విశ్లేషం లేదు, ఏర్పడదు – అనే తత్వం ఇక్కడ సూచింపబడింది.

**"మలర్ కుళలాళ్ శీదైయుమ్" (తానుమ్)**

(పెరియాళ్వార్ తిరుమొళి –3 – 10– 9)

పూలతో అలంకరించదగిన, అందమైన కేశాలను కలిగిన సీతాదేవి.

సహజంగా పూలతో అలంకరించదగిన కేశాలను కలిగినది సీతాదేవి. కాని, ఇంతకాలంగా రామ విరహం వల్ల ఆమె తన కేశాలలో పూలను అలంకరించుకోలేదు. ఇప్పుడు ఆ విశ్లేషం తీరిపోయింది కనుక, తన కేశాలకు ఆమె పూలను అలంకరించుకున్నది. అటువంటి గొప్ప కేశసౌందర్యం కలిగిన సీతాదేవితో శ్రీరామచంద్రుడు కలసి

**"కోప్పుడైయ శీరియ శింగాదనత్తిరుందు" (తిరుప్పావై– 23)**

తనకు మాత్రమే తగిన గొప్పదైన సింహాసనంలో వేంచేసి ఉండి.

శ్రీరామచంద్రుడు అధిష్ఠించిన రాజసింహాసనం అతడు అధిష్టించడానికి మాత్రమే తగినది. ఇంకొకరు ఎవరూ ఆ సింహాసనంలో కూర్చొనదగిన యోగ్యత కలిగినవారు కారు. అందువల్లనే, భరతుడు ఆ సింహాసనంలో తాను కూర్చొనకుండా, శ్రీరాముని పాదుకలను అధిష్ఠింపజేశాడు. అంతేకాదు శ్రీరాముడు సీతాదేవితో "సహసీతం న్యవేశయత్" అనే విధంగా కలసి కూర్చున్నందునకూడా అది "శీరియ శింగాశనమ్" అయినది.

**"ఏఴులగుమ్ తనిక్కోల్ శెల్ల వాఴ్విత్తరుళినార్."**

(తిరువాయ్ మొఴి– 4–5– 1)

ఏడు లోకాలను తన అద్వితీయమైన అజ్ఞాదండంతో ఉజ్జీవింప చేశాడు.

పాశురప్పడి రామాయణమ్

శ్రీరాముని పాలనలో అయోధ్యానగరం, కోసలరాజ్యం మాత్రమే కాదు,

" రామభూతం జగదభూత్ రామే రాజ్యం ప్రశాసతి" అనే విధంగా ఈ భూమండలం అంతా కూడా సుఖించింది.

రామరాజ్యంలో సమస్త భూమండలం ఆనందించిన రీతిని వాల్మీకి మహర్షి యుద్ధకాండ చివరలో విశదంగా వర్ణించాడు.

ఈ పాశురప్పడి రామాయణాన్ని అనుసంధించినవారికి శ్రీవాల్మీకి రామాయణం మొత్తం అనుసంధించిన ఫలం, నాలాయిర దివ్యప్రబంధాలను అన్నిటిని అనుసంధించిన ఫలం తప్పక కలుగుతుంది.

ఆళ్వారులు అనుభవించిన శ్రీరామాయణ కథాప్రకారాన్ని దివ్య ప్రబంధాలలోని సూక్తులను సంకలనం చేసి పాశురప్పడి రామాయణం అనే పేరుతో అనుగ్రహించినవారు పరమ కారుణికులు అయిన, శ్రీకృష్ణ సూరి అనబడే శ్రీపెరియ వాచ్చాన్ పిళ్లై. వారి దివ్యసన్నిధిలో మనమందరం సబ్ ప్రణిపాతంగా కృతజ్ఞతా నివేదనను చేసికొందాం.

పాశురప్పడి రామాయణమ్ ముற்றிற்று

★★★★★